# కినిమా

(సినిమా మాస పత్రిక)



ప్రారంభసంచిక ఆగష్టులో వెలువడుతోంది!

విడిసంచిక **0 - 8 - 0**



సాలుచందా రు. **6-0-0**

పాఠకులలేఖలు, సందేహాలు - సమాధానాలు, చిత్రవార్తలు, సినిమా అనుభవాలు, స్కెచ్‌లు, సినిమాకథలు, ఇంకా ఎన్నెన్నో శీర్షికలతో—ముచ్చటైన ముద్రణతో, అందమైన ఫోటోలతో, సర్వాంగసుందరంగా సినిమాపాఠకలోకాన్ని రంజింపజేస్తుంది.

కాపీకొరకు మీ ఏజెంటును అడగండి!

వివరాలకు

## చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26.

త్వరలో వస్తూంది!





ఈస్టిండియా ఫిలిం కంపెనీ వారి

# సంక్రాంతి

డైరెక్టర్ :
సి. పుల్లయ్య



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4

---

బంగారు కవరింగ్ చేయబడిన RAJA బ్రాండు ఆభరణములు

కలరు 10 సం॥ గ్యారంటి

రాజా గోల్డు కవరింగ్ కంపెని మచిలీపట్నం

రౌండు, బాదం, కాఫీ, చంద్రహారములు, 24" యించి, పేట 1-కి రు. 11/- సాదా సల్లపూసల చైను 18" యించి 1-కి రు. 5/- ఫ్లవర్ సల్లపూసల చైను 18" యించి 1-కి రు. 7/8/- ఆర్డరుతో 800 డిజైనులుగల క్యాటలాగు వుచితంగా పంపబడును. ప్యాకింగు పోస్టేజి రు. 1 అదనము

రాజా గోల్డు కవరింగ్ కంపెనీ (రిజిష్టర్డు)
రాజా బిల్డింగ్సు :: మచిలీపట్నం

---



# పిల్లలంటే తల్లులకు తీపి
# పిప్పరమెంట్లు పిల్లలకు తీపి

తియ్యని పిప్పరమెంట్లు







**M.A.P. INDUSTRIES**
**TONDIARPET. MADRAS.21**

# చందూ యొక్క సాహసకృత్యములు











చందూయొక్క సాహసము.






జూలై **24**-నుంచి
ఆంధ్ర దేశమంతటా
ప్రదర్శింప
బడుతున్నది

# అత్తింటి కాపురం

మాడర్న్ థియేటర్స్ తయారు
ఆడజన్మలో ప్రసిద్ధిగాంచిన
బి.యస్.సరోజ నటించినది

పూర్ణా రిలీస్...




# వెన్ను విరిచే చాకిరీ మానండి

కొత్తపద్ధతులు తెలుసుకోండి—కట్టింపు చూడండి—నాణ్యం గమనించండి

ఇంటి వాడుకకి పూర్తిగా గోద్రెజ్ వాషింగు సబ్బునూక వాడండి. బట్టలు, గచ్చునేలలు, మోరీలు, గాజు, పింగాణీవస్తువులు, అన్నింటినీ ఇట్టే శుభ్రపరుస్తుంది.

ఇది సర్వోపయోగంగా వన్నెదీర్చిన బట్టలసబ్బు, కొత్తరకపు నిగ్గుదేరిన సదుపాయమైన నూకలరూపంలో వాడడంవలన కొద్ది పనికే హెచ్చు ఫలం రాబడుతుంది.




1 పౌను, 3 పౌనుల పెట్టెలోను, మరియు 56 పౌనులు సంచులలోను లభించును.

## గోద్రెజ్ సోప్స్, లి.,

అమ్మకపు డిపో — బొంబాయి : జాకబ్‌సర్కిలు పోస్టు.

మద్రాసు : 164, బ్రాడ్వే. :: హైద్రాబాదు : 1239, అబిడ్‌రోడ్డు.

# చందమామ

సంచాలకుడు :: చక్రపాణి

సంపుటి 11 : ఆగస్టు 1952 : సంచిక 2

గతనెల ప్రారంభించిన 'ఫోటో వ్యాఖ్యలపోటీ'ని అందిపుచ్చుకొని పాఠకులు ఎంతటి ఉత్సాహంతో పాల్గొన్నారో చెప్పటానికి, వేయికిమించి మాకువచ్చిన ఉత్తరాలే ప్రబలనిదర్శనం. ఇది చాలా సంతోషమైన విషయం. ఐతే - ఇన్ని జాబులలోనూ ఎక్కువగా వచ్చినవి పాతధోరణిలో నడిచిన జవాబులే. అనగా: 'కయ్యము - నెయ్యము', 'విరసము - సరసము' మొదలైన జంటమాటలు. ఈ జవాబులు నియమాలకు వప్పుతూనేవున్నాయి. కాదనలేము. కాని, లోపమొక్కటే—కొత్తదనం లేకపోవటం. ఈ నెల బహుమతిపొందిన వ్యాఖ్య 'బాలల గోడు - చిలుకల జోడు' అనేది. ఇందులో చిన్నిపదాలు, చక్కటి శయ్య, ముచ్చటైన గమకం, కవితఅల్లినట్టు విన సొంపుగా ఉన్నదికద! ఈ వ్యాఖ్యకు బహుమానం ఇవ్వటంలో పాఠకులందరూ మాతో ఏకీభవిస్తారని నమ్ముతున్నాము. ఇది ఊతగా పాఠకులు తరువాతి పోటీకి మనోజ్ఞమైన వ్యాఖ్యను కూర్చి పంపాలి.



# స్నేహ ధర్మం





అనగనగా మరి, ఒక ఊళ్ళో
ఉన్నా రిద్దరు కుర్రాళ్ళూ.
దిక్కు లేని వారిద్దరునూ
ముక్కుపచ్చ లారనివాళ్ళూ.

కొంపా గోడూ లేదేమీ.
పూట కూటికే గతిలేదు.
చిరిగిన, మరకల ఉడుపులకూ
మసిగుడ్డయినా సరిరాదు.

ఏది దొరికితే అది తింటూ
ఆకలి తీర్చుకొనేవాళ్ళు.
రోడ్డుప్రక్క నే పైపుంటే
దప్పిక ఆర్చుకునేవాళ్ళు.

వాన విసుగా ముసురొస్తే
ఏ పంచో వెదికేవాళ్ళు.
వేసవికాలపు రాత్రిళ్ళూ
ఆరుబైట గడిపేవాళ్ళు.

వారిని చూచినవారంతా
అన్నదమ్ము లనుకొన్నారు.
కాని వాస్తవంగా వారూ
చుట్టా లెట్లాగూ కారు.

చుట్టరికంగా దారిద్ర్యం
వారిని దగ్గరచేసింది.
స్నేహం ఉచ్చులుగా పన్ని
కాళ్ళకు బందా లేసింది.

చలికాలం ఒకరోజుదయం
వా రాకలిగా లేచారు.
ఎక్కడ ఏమి దొరుకుతుందా
అని చుట్టూ కలజూచారు.

రోడ్డువెంబడే పోతుంటే
నారింజొక్కటి దొరికింది.
పెద్దవాడు పరుగెత్తాడు
కాయకేసి చెయ్యూరికింది.

దానిని తీసుక ఆత్రంగా
తోలు ఒలిచి తినబోయాడు.
కాని అంతలో ఇంకొకడూ
ఉన్నాడని గుర్తించాడు.

చిన్నవాడనీ దయదలచీ
కాయ అతనికే ఇచ్చాడు.
'అయ్యో! తొందరపడ్డానే'
అని మనసున కడు నొచ్చాడు.

చిన్నవాడు సగపాలు గొనీ
సగ మాతనికే ఇచ్చాడు.
ఇద్దరి ఆకలి తీరేట్టు
న్యాయంగా సరిపుచ్చాడు.

ఇతరులు నీయెడ ఏవిధిగా
వర్తించాలనుకొంటావో!
నీవు వారియెడ అట్లాగే
వర్తించాలని అనుకోవే!






రచన: "బైరాగి"



1



2



3



4



5



6



7



8



9

ఇక్కడ తొమ్మిది బొమ్మలున్నవి. వీటిల్లో ప్రతి బొమ్మలోనూ మా చిత్రకారుడు ఒక్కొక్క విధమైన తప్పు చేసివున్నాడు. అ తప్పులేమిటో మీరు పట్టగలరా?

సరిఅయిన జవాబులకు వచ్చేనెల చందమామ చూడండి.




పూర్వకాలమందు రష్యాదేశపు ఒక పల్లెటూరిలో ఒక శ్రీమంతుడు ఉండేవాడు. అతనికి 'సోనియా' అనే కూతురు. సోనియా తల్లి పోవటంచేత, తండ్రి మళ్ళీ పెళ్ళిచేసుకొన్నాడు. రెండవ భార్యకు 'నటాషా' అనే ఒక కూతురు.

నటాషా పెరిగి పెద్ద అవుతున్నకొద్దీ ఆమె తల్లికి సవతికూతురుపైన అసూయ ఎక్కువ కాజొచ్చింది. పాపం, తల్లీకూతుళ్ళు సోనియాను యమయాతనలు పెట్టసాగారు.

సోనియా చక్కని చుక్క. బుద్ధిమంతురాలు. ఓరిమికి పెట్టినది పేరు. సవతితల్లి ఎన్ని తిప్పలుపెట్టినా, భరించేది. తనమీద పడిన ఇంటెడు చాకిరీ సంతోషంగా చేసేది. ఇదంతా తండ్రికితెలుసు. ఐనా, వాళ్లను ఏమీ అనలేకపోయేవాడు.

ఏదో వంకపెట్టి తల్లీ కూతుళ్ళు సోనియాను వెళ్లగొట్టాలని నిశ్చయించారు. యేదైనా అసాధ్యకార్యమొకటి వప్పజెప్పి తిరిగి యింటిమొహం చూడకుండా ఏ అడవులలోనో పడి తిరుగులాడుతూవుండేటట్టు చేదామనుకొన్నారు.

అది డిశంబరునెల. గడ్డు శీతకాలం. రష్యాదేశంలో శీతకాలమంటే మనదేశంలో లాగా కాదు. భూమి అంతా మంచుతో కప్పబడివుంటుంది. మొక్క అనేది మొలవనే మొలవదు.

సవతిబిడ్డ సోనియాను తల్లి చేరబిలిచి "అమ్మాయీ! కొండమీదపూచే పువ్వులు కాసిని వైద్యంలోకి కావలసివచ్చినై. ఏ శ్రమలైనాపడి ఆ పువ్వులు పట్టుకురావాలి. వెళ్ళు, వెంటనే" అంటూ వేగిరపెట్టింది. సంతోషంతో బయల్దేరింది సోనియా. 'పీడ వదిలింది, ఇక అది మళ్ళీ గడపతొక్కటం కల్ల' అని అనుకొని సంతోషించారు, తల్లీ కూతుళ్ళు.

వజ్జల రమేశు - కిడ్డర్పూర్ (కలకత్తా)



పోయి పోయి, అడవులెన్నో తిరిగి తిరిగి, సోనియా కొన్నాళ్లకు ఒక కొండప్రదేశం చేరుకున్నది. అదంతా మంచుమయం! దారీ తెన్నూ తెలియటమేలేదు. అయితే, అల్లంత ఎత్తున మినుకుమినుకుమంటూ ఒక చిన్న వెలుగు అప్పుడప్పుడు కనిపిస్తూ వచ్చింది. ఆ వెలుగు గుర్తుగా పెట్టుకొని, ఆమె అదేవైపు పోసాగింది.

చేరువకు పోయినకొద్దీ ఆ వెలుగు పెద్దది కాజొచ్చింది. ఆమెకు ఆశ్చర్యంవేసింది. ఇంకా దగ్గరకు వెళ్ళింది. అది ఒక చలి మంట. దానిచుట్టూతా కొంతమంది పురుషులు కూర్చుని చలికాచుకొంటున్నారు.

సోనియా ధైర్యంగా మంటదగ్గరకు వెళ్ళి, కూర్చున్నవారికి నమస్కరించింది.

కూర్చున్న వాళ్ళు పదకొండుమంది. అక్కడనే పక్కన ఎత్తయిన ఒక సింహాసనంమీద ఒక ముసలి రాజు తలపైన కిరీటమూ చేతిలో రాజదండమూ ధరించి కూర్చున్నాడు. సోనియాపెట్టిన నమస్కారాన్ని ఆయనే అందుకున్నాడు.

కూర్చునివున్న పదకొండుమందిలో ఒకాయన ఆమెను పలకరిస్తూ 'అమ్మాయీ! నీ వెవరవు? మానవులు చొరరాని ఈ ప్రదేశానికి ఈ అపరాత్రివేళ పనిగట్టుకొని ఎందుకు వచ్చావు?'అని ఆశ్చర్యంగా అడుగుతూ, మళ్లీ ఆవెంటనే "మేము మాసాలను పాలించే రాజులము. జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ మొదలైనవి మా పేర్లు. ఏడాది పన్నెండు నెలలలో ఒక్కొక నెలకు ఒక్కొక్కరం అధిపతిగా వుంటాము. ఇప్పుడు ఆ సింహాసనంమీద కూర్చున్న ఆయన డిశంబరు మహారాజులుంగారు" అని ఆమెకు తెలియజెప్పాడు.

సోనియా గిరుక్కున ఆ డిశంబరు మహారాజులుంగారివేపు తిరిగింది. ఆ మంట యొక్క కాంతికి బంగరుబొమ్మలాగా

మెరిసిపోయే ఆ బాలికను చూచాడు రాజు. ఆమె ముఖం చిరునవ్వుతోనే ఉన్నప్పటికీ, అమాయకమైన దైన్యంతో కూడివున్నట్టు కనిపించింది.

దయనీయమైన ఆమెచరిత్ర వినటంతోనే డిశంబరురాజు ఆమెను ఓదారుస్తూ తను గద్దె దిగి, మంటవద్ద కూర్చునివున్న 'జూన్' రాజును సింహాసనం ఎక్కమన్నాడు.

జూన్‌రాజు గద్దెమీద కూర్చుని, అజ్ఞాపూర్వకంగా ఒక్కసారి దండం ఊపేసరికల్లా కొండమీది మంచు తృటిలో కరిగిపోయింది. చూస్తూవుండగానే భూమిఅంతా పచ్చగా, కనుపండువుగా కనిపించింది. మొక్కలు మొలిచినై. చేలుపండినై. పూలమొక్కలు పుష్పించినై. కాయలతో చెట్లు నిండిపోయినై.

రాజు అనుమతిపైన సోనియా అపరిమితమైన సంతోషంతో వొడినిండా కావలసినన్ని పూవులు కోసుకొన్నది. పువ్వులు సృష్టించి యివ్వటమేగాకుండా, యింటికి వెళ్ళేవరకు అవి వాడిపోకుండా ఉండేట్టు కూడా రాజు వరంఇచ్చాడు. సోనియా కోరిక నెరవేర్చడంతోనే జూన్‌రాజు గద్దెదిగి, మళ్లీ చలిమంటవద్దకు పోయాడు.




అప్పుడు డిశంబరుమహారాజులుంగారు యథాప్రకారం గద్దె ఎక్కాడు. జూన్‌రాజు దిగటంతోనే మొక్కా, మోడీ మాయమైనాయి. డిశంబర్‌రాజు ఎక్కటంతోనే మళ్లీ కొండలన్నీ మంచుతో ఘనీభవించినై.

పన్నెండుగురు రాజులకూ సోనియా కృతజ్ఞత తెలిపి, సెలవుతీసుకొని వెళ్లిపోయి ఇల్లు చేరుకుంది. సోనియా కంటబడేసరికల్లా తల్లీ కూతుళ్ళకు అమితాశ్చర్యం కలిగింది. ఏమీ?—

ఆమె తిరిగి వొస్తుందని వాళ్లు కలలోనూ తలచలేదు. పైగా, అకాలంలో పువ్వులు పుట్టించుకువచ్చి, కేవలమూ ఒక అసాధ్య

కార్యాన్ని సాధించుకువచ్చిన ఆమె ప్రజ్ఞకు మరీ ఆశ్చర్యం పొందారు. అంతేకాదు. ఆమెపైన అసూయచెందారు.

'ఈ పువ్వులు ఎక్కడ పుట్టించుకు వచ్చావు చెప్పు' అని వాళ్ళు గద్దించారు. జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పింది సోనియా. అపరూపమైన ఈ పువ్వులను తీసుకువద్దామని నటాషాకూడా బయల్దేరింది. శ్రమపడి కొండప్రదేశం చేరుకుంది. ఈమెకూ కొండమీద వెలుగూ, మంటచుట్టూ కూర్చునివున్న రాజులూ కనిపించారు.

అందులో ఒక రాజు ఆమెను పలకరించాడు. అందుకామె 'పోవయ్యా పెద్ద మనిషీ, నాగొడవ నీకెందుకు?' అనేసి, తనదారిని పోబోయింది. నాలుగడుగులు వేసిందో లేదో, రాజు దండం తిప్పేసరికి, దబదబా మంచుపెల్లలు మీదపడి మరి అనవాలులేకుండా ఆమె కప్పడిపోయింది.

కూతురుకోసం ఆత్రంతో ఎదురు చూచింది తల్లి. ఎన్నాళ్లకూ రాకపోవటంతో తనే బయల్దేరింది. ఈమెకూడా శ్రమలుపడి కొండ చేరుకుంది. రాజులువేసిన కుశల ప్రశ్నకు ఈమెకూడా వికటంగానే జవాబు చెప్పేసరికి, కూతురుకు పట్టినగతే తల్లికీ పట్టింది!! తల్లీ కూతుళ్ళు తగినశాస్తి అనుభవించారు. తల్లీకూతుళ్లు తిరిగి రాకపోవటంతో సోనియాకు కలవరం పుట్టింది. ఆమె మళ్ళీ మంచుకొండలవద్దకు పోగా, ఆ రాజులవల్ల జరిగిన సంగతిఅంతా తెలిసింది. సోనియా తన మాటమంచితనంతో వారి కడుపులు కరిగించి, సవతితల్లినీ నటాషానూ బతికించుకుంది.

జూన్‌మాసంలో పూయవలసిన పువ్వులను ప్రత్యేకించి సోనియాకోసం డిశంబరు నెలలోనే సృష్టించిఇచ్చిన జూన్‌మహారాజు ఆజ్ఞప్రకారం ఆ పువ్వులకు 'డిశంబరుపువ్వు' లనే పేరు శాశ్వతంగా నిలిచిపోయింది.






# 8

[దేవసింహుని జాడకోసం శక్తిసింహుడు ఎలాగో అపూర్వసౌధం చేరుకోవటం, అయితే తలవనితలంపుగా అది మాయమై, పరివారం పకులుగా ఎగిరిపోయి శ్రమ వృథాకావటం, ధైర్యంవిడువక అతడు వెతుకుతూపోయి ఒక పర్వతశ్రేణి చేరుకోగలిగినా, దారీతెన్నూ లేని ఒక పర్వతంకొనని ఆగిపోవలసిరావటంవరకూ చదివారుకదా! ఆ తర్వాత—]

ఏమైనాసరే అవతలిగట్టు చేరుకొని, ఆ కనుపించే దేవాలయమేమిటో తెలుసుకు తీరాలని పట్టుబట్టిన శక్తిసింహుడు అంత లోనే ఆలోచనలోపడ్డాడు: "అనవసరంగా తొందరపడి ఈ ప్రయత్నంలో నేను ప్రాణాలు కోల్పోయానంటే ఇంకేమున్నది? కనుక కొద్దిరోజులు ఆలస్యమైనా, మరో సులువైనమార్గంలో అక్కడ చేరేప్రయత్నం చెయ్యటం మంచిది" అనుకున్నాడు. ఈ నిశ్చయంతో శక్తిసింహుడు వెనుకకు మరలి, తను ఎక్కివచ్చిన పర్వతశ్రేణి అంతా దాటి తిరిగి క్రిందకు చేరుకున్నాడు. అయితే, అతను పర్వతశ్రేణి ఎక్కేటప్పుడు తన గుఱ్ఱాన్ని దిగువని వదిలేసివచ్చాడు. అది ఎటుపోయిందో ఏమో ఇప్పుడు అక్కడ లేదు. చేసేదిలేక శక్తిసింహుడు కాలినడకనే బయలుదేరాడు.

ఇక దేవసింహుడి సంగతి చూదాం:

దేవసింహుడు తిరిగి తిరిగి తన భవనం చేరుకునేసరికే భవనం మాయమైపోయె! దిగువనిమాత్రం మంత్రి, ఆస్థానవైద్యుడూ వున్నారు. ఈ మాయ దేవసింహుడికి అర్థం కాలేదు. భవనం ఏమైనట్టు? క్రిందకు దిగివెళ్ళి వాళ్ళని అడిగితే తెలుస్తుందేమో?



విమానం ఆగటమేమిటి, దేవాలయం ముందు వృద్ధురాలు ప్రత్యక్షం కావట మేమిటి? రెండూ ఒక్కమారే జరిగినై. దేవసింహుడి ఆశ్చర్యానికి అంతులేదు. ఈ చిత్రమేమిటని అతను వృద్ధురాలిని అడగ బోయేటంతలో ఆమె దేవసింహుడిని ఎత్తుకుని ఆలయంలో ప్రవేశించింది.

లోపలకు వెళ్ళాక దేవసింహుడు అడిగాడు: "అపూర్వమైన మన సౌధం ఏమైంది? ఈ దేవాలయమేమిటి? ఇంత కాలమూ నా అదుపాజ్ఞలలో ఉంటూవచ్చిన విమానం యివాళ యిలా అడ్డుతిరగటానికి కారణమేమిటి?" అని.

ఇన్ని ప్రశ్నలకూ వృద్ధురాలు ఒకే జవాబుగా "ఇవన్నీ నువ్వు అడగకూడదు. అక్కడికంటే యిక్కడే ఎంతో హాయిగా వుంటుంది. అయితే కొంతకాలంవరకు నీవు విమానంలో బయటికి వెళ్లకూడదు. అందుచేత యిక్కడనే వుండి కులాసాగా కాలంగడుపుతూవుండు. నేనువచ్చి చూచి పోతూవుంటాను" అని చెప్పి వూరుకుంది.

ఇలా అంటూనే వృద్ధురాలు దేవసింహుడివద్దనున్న మాయవిమానం తీసుకున్నది. చూస్తూచూస్తూవుండేటంతలో

అంతకు తప్ప మరోమార్గంలేదు. అందుచేత క్రిందకు దిగాలని నిశ్చయించుకున్నాడు. కాని చిత్రం! మాయవిమానం క్రిందకు దిగటానికి బదులు, ముందుకు పోసాగింది.

ఈమారు ఎలాగైనా దేవసింహుడికి నమ్మికకలిగించి తమతో తీసుకుపోవచ్చునని ఆశపడిన మంత్రికీ, వైద్యునికి యిలా జరగటం నిస్పృహ కలిగించింది. విమానం వైపే చూస్తూ వారు నిలబడిపోయారు.

దేవసింహుడి విమానం వెళ్ళివెళ్ళి, ఎత్తైన ఒక పర్వతంమీది దేవాలయం ముందు ఆగింది. శక్తిసింహుడికి లోగడ కనుపించిన దేవాలయమే యిది!



అంతటిపెద్ద వొప్పా ముడుచుకుపోయి, చిన్న బంతిలాగా తయారైంది. ఆ బంతిని ఆమె దేవసింహుడి చేతికిచ్చి, "దీనిని భద్రంగా దాచివుంచుకో" అనిచెప్పి మాయమైంది.

వృద్ధురాలు వెళ్ళాక, దేవసింహుడు మెల్లిగా ఆ దేవాలయమంతా కలియతిరిగి చూచాడు. బయటినుండి చూడటానికి అది దేవాలయంలాగే ఉన్నప్పటికీ, లోపల ఎన్నో చిత్రాలు కనుపించినై. ఒకచోట రకరకాల పక్షులు కిలకిలమంటూ ఎగురుతున్నై. మరొకచోట లేళ్ళూ, దుప్పులూ మొదలైన సాధుజంతువులు కనుపించినై. ఇంకా లోపలికి పోగా భయంకరమైన సర్పాలు బుసలుకొడుతూ నేలపైన తిరుగాడుతున్నై. మరొకచోట గోండ్రుపెడుతూ సింహాలూ, పెద్దపులులూ తిరుగుతున్నై.

వీటన్నింటినిచూచి దేవసింహుడు భయపడనేలేదు. అవన్నీ మామూలు ఆటవస్తువులేనని అనుకొని, వాటిమధ్య నిర్భయంగా తిరుగసాగాడు. చిత్రమేమిటంటే అవికూడా దేవసింహుడిజోలికి పోకుండా తమ మానాన అవి తిరుగులాడుతున్నై.

దేవసింహుడు ఈ చిత్రాలన్నీ చూచుకుంటూ పోగాపోగా, ఒకచిన్న పూలతోట





కనుపించింది. దానిమధ్యని సరిగా తనకు ఈడూ జోడూ అయిన ఒకచిన్న కుఱ్ఱవాడు ఉల్లాసంగా ఆడుకుంటున్నాడు.

ఈ కుఱ్ఱవానిని చూడటంతోటే దేవసింహుడిప్రాణం లేచివచ్చింది. ఆ కుఱ్ఱవాడెవరో తెలుసుకోవాలనికూడా ప్రయత్నించలేదు. చరచర పాకుకుంటూ వెళ్లి— "ఆడుకుందాం, వస్తావా?" అనిఅడిగాడు.

"అలాగే! మరి నాతో సరిగా నువ్వు పరుగెత్తలేవుగా?" అన్నాడు ఆ కుఱ్ఱవాడు, దేవసింహుడి కాళ్లపంక జాలిగాచూస్తూ.

ఇన్నాళ్ళూ ఆటపాటలలో దేవసింహుడు తన అవిటి కాళ్ల సంగతే మరిచిపోయాడు. తను కుంటివాడిననే ధ్యాసే లేదు. కాని, యిప్పుడు ఈ కుఱ్ఱవాడు యిలా అనటంతో తను అవిటివాడినన్న సంగతి మళ్ళీ గుర్తురాగా ఒక్కసారి దుఃఖం పొర్లుకొనివచ్చింది.

ఇది చూచి ఆ కుఱ్ఱవాడు—"ఎందుకు ఏడుస్తావ్! ఫరవాలేదులే, రా ఆడుకుందాం" అంటూ దేవసింహుడిని ఓదార్చాడు. అప్పటినించి ఆ కుఱ్ఱవాడితో చేరి హాయిగా కాలం వెళ్లబుచ్చుతున్నాడు దేవసింహుడు.

ఇలావుండగా ఒకనాడు వృద్ధురాలు ఇచ్చివెళ్లిన ఆ బంతితో వాళ్లు ఆడుకొంటూవుంటే అది రివ్వున దేవాలయం దాటి దూరాన పడిపోయింది.

ఎంతో భద్రంగా దాచుకొనమని చెప్పి వృద్ధురాలు యిచ్చిన బంతి యిలా పోవటంతో దేవసింహుడు దుఃఖించాడు. అది చూచి, తోటికుఱ్ఱవాడు—"పోతే పోయిందిలే. ఇంతమాత్రానికి ఏడుస్తావేం!" అని ఓదార్చబోయాడు.

వృద్ధురాలు చెప్పినసంగతి వెల్లడించితే తన అజాగ్రత్త బయటపడిపోతుందని సిగ్గుపడ్డాడు, దేవసింహుడు. అందుచేత బంతిసంగతి అంతటితో వదిలేసి, మళ్ళీ

ఎప్పటిలా ఆ కుర్రవానితో చేరి ఆడుకో సాగాడు.

*    *    *

కొంతకాలం గడిచింది. శక్తిసింహుడు అష్టకష్టాలూ పడి ఎలాగైతేనేమి ఆ దేవా లయం దరిదాపులకు వచ్చేశాడు. త్రోవలో కుర్రవాళ్ళు పారవేసుకున్న ఆ బంతి కంట బడి, దానినితీసుకుని పరిశీలనగా చూచాడు. దానిలో ప్రత్యేకత ఏమీ కనుపించలేదు. అయినా ఎందుకైనా మంచిదని తీసి తన వద్ద భద్రపరుచుకొని, దేవాలయంవున్న పర్వతం ఎక్కసాగాడు.

మరి కొద్దిసేపటికల్లా శక్తిసింహుడు దేవాలయద్వారంవద్దకు చేరుకున్నాడు. అయితే తలుపులు మూసివున్నయి. తెరవ టానికి వీలులేకపోయింది. ఏమీతోచక, తలుపు తట్టాడు. బదులులేదు. అలానే కాచుకొని కూర్చున్నాడు.

*    *    *

అక్కడ మంత్రీ, వైద్యుడూ కొద్దిరోజులు దేవసింహుడి రాకకు ఎదురుచూచారు. కాని ఏజాడా కనుపించక నిరాశచెంది, అక్కడవుండి ప్రయోజనంలేదని నిశ్చ యించుకున్నారు.




మరునాడే ఆచోటు వదిలి దేవసింహు డిని వెతుక్కుంటూ బయలుదేరారు. కొద్ది రోజులు ప్రయాణంచేయగా, ఒకచోట శక్తిసింహుడి అశ్వికులు తటస్థపడ్డారు.

మంత్రిని వాళ్లు ఆనవాలుకట్టారు. ఆస్థానవైద్యుడుకూడా వెంటవుండటం చూచి చకితులైనారు.

మంత్రి పరమదుర్మార్గుడనీ, కంటికి కనబడితే ప్రాణాలతో వదలవద్దనీ చెబుతూ వచ్చిన వైద్యుడు తనే మంత్రితో కలిసి వుండటం విడ్డూరంకదూ! మరి, ఇప్పుడేమిటి చేయటం? ఒక్కసారిగా వాళ్లమనస్సులో ఆలోచనలు గిర్రునతిరిగినై:




కత్తులుదూశారు. మంత్రిపైన పడబో యారు. వైద్యుడు అడ్డుకున్నాడు.

"తొందరపడకండి. మన మంత్రి నిర్దోషి. మనం తలచిందంతా అపోహ. దోషి ఎవరో తేలాలి. అందుకోసమే ఇలా తిరుగు లాడుతున్నాం" అన్నాడు.

అందుకు అశ్వికులు—"అదా సంగతి! సరే, అసలు మేమువచ్చింది మహారాజావారి కోసం. శత్రురాజు వచ్చి మనరాజ్యాన్ని చుట్టుముట్టాడు. వశంచేసుకునేటట్టున్నాడు. పరిస్థితి చాలా ప్రమాదంగావున్నది. ప్రభువు ఎక్కడ?" అంటూ వట్టగాని తమ ఆత్రం వెల్లడించారు.

మంత్రీ, వైద్యుడూ ఆశ్చర్యపోయారు. "శత్రురాజా! మన సిబ్బంది ఏమై పోయింది?" అని గద్దించాడు మంత్రి.

"అంతా కర్మ. సిబ్బందిలో మూడు వంతులు మిమ్మల్ని వెతకిపట్టటానికే దేశం నలుమూలలకూ పరుగులెత్తారు. మిగిలిన కొద్దిమందివల్ల ఏమవుతుంది?" అన్నారు అశ్వికులు.

"సరే, ఇప్పుడే బయలుదేరుదాం. ముందు రాజ్యాన్ని రక్షించుకోవాలి!" అన్నాడు మంత్రి ఆవేగంతో.

"అలాకాదు. మీరు మీప్రయత్నంమీద యిక్కడనే వుండండి. నేను వీళ్లతో వెళ్లి రాజ్యం నిలబడేమార్గం చూస్తాను" అన్నాడు వైద్యుడు.

సరేనన్నాడు మంత్రి. వైద్యుడు అశ్వి కులవెంట బయలుదేరాడు.

* * *

అక్కడ దేవాలయంముందు కూర్చున్న శక్తిసింహుడికి మరికొద్దిసేపటికల్లా ఒక చిన్న కునుకుపట్టింది. కునుకులో అతనికి ఒక కల వచ్చింది:

తనరాజ్యం అంతా అల్లకల్లోలమైపోయిం దట; ప్రజలు విచ్చలవిడిగా సంచరిస్తున్నా

రట; ఈ అదను చూచి, శత్రురాజు సైన్యంతో వచ్చి రాజ్యాన్ని చుట్టుముట్టినాడట.

కలవరపడుతూ మేల్కొంచాడు శక్తిసింహుడు. చూడగా దేవాలయద్వారం ముందే వున్నాడు! ఇదంతా కల అని ఊహించాడు. కల గాంచిన దృశ్యాలతో మనస్సు ఆవేదనా పూరితమైపోయింది.

శక్తిసింహుడికి కలలంటే ఎంతో నమ్మకం. కలలో కనుపించినవి జరిగేవుంటవని భయం కూడాను. ఈ భయంతో ఒక్కసారి రాజ్యం ఎలావున్నదో స్వయంగా తెలుసుకొంటేగాని స్తిమితంచిక్కేటట్టు తోచలేదు. లేచి రెండు రోజులకల్లా కొండ దిగువకు చేరుకున్నాడు.

విధీ విరామం లేని శ్రమదమాదులతో శక్తిసింహుడు అలసిపోయాడు. ఇంత కాలమూ గుఱ్ఱం ఉండటంవల్ల యెంత దూరం ప్రయాణించేసినా కష్టం తెలిసి రాలేదు. ఇప్పుడు అడుగుపడటమే అసాధ్యంగా తోచింది. డస్సిపోయి ఒక చెట్టు నీడని విశ్రమించేసరికి ఇట్టే నిద్రపట్టేసింది. ఆ నిద్రలో మళ్ళీ కలగన్నాడు. ఇందాకటి కల పూర్తిగాక, మళ్ళీ ఇలా స్వప్నావస్థలో పడ్డాడో యేమో! కలలోవిశేషాలు ఇవి—తను కొండపైని దేవాలయం చేరు




కున్నట్టూ, తలుపులు తెరిచేవున్నట్టూ, లోపలికి ప్రవేశించి వెళ్లగా ఒక తోటలో యిద్దరు చిన్ని కుర్రవాళ్లు ఆడుకొంటూ న్నట్టూ కనిపించింది. ఆడుకొంటూవున్న ఆ కుర్రవాళ్లలో ఒకడు తన మేనల్లుడైనట్టు స్పష్టంగా కనిపించింది!

ఎప్పుడైతే దేవసింహుడు కనుపించాడో "ఏమిటిది! నా దేవసింహుడే" అంటూ వానిని చేతులలోకి తీసుకోబోతుండగా మెలకువ వచ్చేసింది. ఈ స్వప్నంతో శక్తి సింహుడి ఆవేదన మరింత హెచ్చిపోయింది.

"ఏమిటీ కలలు! ఈ విపరీతం!! నా రాజ్యం శత్రురాజుచేతులలో పడబోతోందా!

నేను చేతులారా తెగటార్చిన దేవసింహుడు ఇంకా బ్రతికివున్నాడా!" అనుకుంటూ, ఒకవంక నిస్పృహతో, మరొకవంక ఆశతో, మళ్లీ ఒకసారి దేవాలయం చేరుకుందామని కొండపైకి బయలుదేరాడు.

కొద్దిరోజులకల్లా కొండపైకి చేరుకొని దేవాలయంవైపు అడుగులువేసేటంతలో తలుపులు తెరుచుకున్న శబ్దమైంది. శక్తి సింహుడికి ప్రాణం లేచివచ్చింది. అటు చూచేసరికల్లా ఒక చిన్ని కుర్రవాడు దేవాలయంలోనుండి బయటకువచ్చి, చరచర వెళ్ళిపోయాడు.

ఆ కుర్రవాడు బయటికి వచ్చేయటంతో ఆలయం తలుపులు ఎప్పటిలా మూసుకున్నై. శక్తిసింహుడు ఆ కుర్రవానిని వెంబడిద్దామని బయలుదేరాడు.

కొంతదూరం వెళ్లేసరికి, ఆ కుర్రవాడు దేనికోసమో వెతుకుతూవుండటం కనుపించింది. శక్తిసింహుడు కుర్రవానిదగ్గరకు వెళ్ళి, "అబ్బాయీ, ఏమిటి వెతుకుతున్నావ్!" అని అడిగాడు.

"మేము ఆడుకొనే బంతి ఇక్కడెక్కడో పడిపోయింది" అన్నాడు కుర్రవాడు.

తనవద్దనున్న బంతితీసి చూపుతూ "ఇదేనా?" అని ప్రశ్నించాడు శక్తిసింహుడు.

"ఆఁ, ఆఁ, ఇదే దీనికోసమే మా నేస్తం ఏడిచి రాగాలెడుతున్నాడు" అన్నాడు కుర్రవాడు.

"పాపం! మీ నేస్తానికి యిచ్చిపద్దాం పద" అంటూ శక్తిసింహుడు ఆ కుర్రవాడిని అప్యాయంగా ఎత్తుకుని దేవాలయం దిక్కుగా బయలుదేరాడు.

---

[శక్తిసింహుడికి చిక్కకుండా దేవసింహుడు తప్పించుకోగలడా? తిరిగి ఇప్పుడు ఒంటరివాడైన మంత్రిగతి ఏమవుతుంది? ఇంతకూ శక్తిసింహుడి రాజ్యం శత్రురాజు వశమైపోతుందా?—ఇవి మరికొన్ని చిత్రసంఘటనలూ వచ్చేనెల]






మనదేశంలో మొగలాయి సామ్రాజ్యాన్ని స్థాపించిన మహమ్మదీయ చక్రవర్తి బేబరు. బేబరు చాలా ధైర్యశాలి. ఎంత ధైర్యవంతుడు కాకుంటే మనదేశానికి దండెత్తి వచ్చి సామ్రాజ్యాన్ని స్థాపించగలడు?

ఐతే, 'ఇల్లు అలకటంతోనే పండుగ కాదు' అన్నట్లు, సామ్రాజ్యం స్థాపించినంతమాత్రాన ఏమయింది? స్థాపించిన దాన్ని వెయ్యికళ్లతో కాపాడాలి. చక్రవర్తికి సామాన్యంగా మిత్రులకంటే శత్రువులే ఎక్కువుంటారు. వాళ్లవల్ల ఏ కీడూ మూడకుండా చూసుకుంటూ వుండాలి. బేబరు చాలా గుండెనిబ్బరంగలవాడు గనక పక్కలో బల్లేలవంటి శత్రువులెందరు వున్నా, భయమనేది లేకుండా రాజ్యం పాలిస్తూవచ్చాడు.

ఆయన అనుచరులలో ఆలీఖాను అనేవాడొకడు వుండేవాడు. ఆలీఖాను రోజూ చక్రవర్తిగారి కందాలో మస్తుగా భోజనంచేసి ఆయనకి సంతోషంకలిగించటానికి ఏవో కబుర్లు మొదలెడుతూండేవాడు.

ఒకనాడు ఆలీఖాను, "ప్రభూ, అల్లాకు తాము అంటే ఎంతో అభిమానం. కనుకనే ఆయన తమకు సర్వసౌఖ్యాలూ అనుభవించవలసిందని చెప్పి ఈ మహాసామ్రాజ్యాన్ని ప్రసాదించారు" అన్నాడు.

చక్రవర్తి, "ఆలీఖాన్!—నీవుద్దేశంలో సామ్రాజ్యంతో సర్వసౌఖ్యాలూ వస్తాయనేనా?" అన్నాడు.

బదులుగా ఆలీఖాను, "సందేహమేమిటి ప్రభూ? తమకన్నా ఎక్కువ సుఖపడేవాడు ఈదేశంలోనేకాదు, ఈ విశాల ప్రపంచంలో ఎక్కడా లేడు" అనేశాడు. చక్రవర్తి, కొంచెం యోచించి, "ఐతే ఆలీఖాన్!— నిన్ను రేపు ఒక్కరోజు చక్రవర్తిగా చేస్తాను. ఆ సుఖమేమిటో నీఅంతట నీవే చూద్దు

కె. సుకుమారలక్ష్మి - తాడిపత్రి



గాని" అన్నాడు. అలీఖాను తన చెవులను తానే నమ్మలేకపోయాడు! "చక్రవర్తిగారు నన్ను రేపు చక్రవర్తిగా చేస్తాననేనా అన్నారు?" అని అతడు ప్రభువుకి వింజామర వేస్తూన్న చాకలిని అడిగాడు. 'అవును బాబూ' అని చాకలి చెప్పగానే, సందేహం కాస్తా తీరి, అలీఖాను పట్టరాని సంతోషంతో గంతులెయ్యటం ప్రారంభించాడు.

మరో కాస్సేపటికల్లా నగరంలో, "రేపు అలీఖానుగారు చక్రవర్తి కాబోతున్నారు!" అని దండోరాకూడా వినపడింది. గొప్పగొప్ప సామంతులందరినీ రమ్మని కోరుతూ అహ్వానాలు వెళ్ళాయి.

"ఎప్పుడు తెల్లవారుతుంది? ఎప్పుడు కిరీటం ధరిస్తాను?" అనుకుంటూ, అలీఖాను కునుకుపట్టక రాత్రంతా మేలుకుని వున్నాడు. నిజానికి, అది కునుకుపట్టే సమయం కాదుకదా?

తెల్లవారటంతోనే బేబరు అతణ్ణి రప్పించి, చక్రవర్తిదుస్తులు ధరింపించి, సింహాసనం మీద అధిష్ఠింపించి, తన కిరీటంతీసి వానిని పెట్టుకోమన్నాడు. అతి వైభవమైన ఆ సందర్భంలో బ్రహ్మాండమైన విందు జరిగింది. తరువాత, సామంతులు ఒక్కొక్కరే వచ్చి, అలీఖానుకి వంగి సలాంచేసి బంతులలో కూర్చోవటానికి వెడుతోంటే అతడికి వళ్లుతెలియనంత సరదాగా వుంది.

బంగారపు పళ్లాలలో మంచి మంచి భక్షణాలన్నీ తెచ్చి మొదట అలీఖానుకీ, తర్వాతనే తక్కినవాళ్ళకి వడ్డన జరిగింది. ఆ భక్షణాలలో కొన్ని అలీఖాను అంతకు ముందెన్నడూ రుచిచూసి ఎరగడు.

ముఖ్యంగా వాటిల్లో 'డిల్‌కుష్' అనే పిండివంట తినాలని అతనికి చాలారోజులనుంచి మనసు. ఇప్పుడు అదును దొరికిందిగదా అని చెప్పి దాన్ని పళ్ళెంలోంచి తీసి నోట్లోవేసుకోటానికని మెడ కాస్త పైకి

ఎత్తేడు. ఎత్తేసరికి, నెత్తికి సూటిగా పైన తళతళ మెరిసే పదునైన పెద్ద కత్తి ఒకటి వేలాడుతూ కనబడింది! దాన్ని వేలాడదీస్త తాడుతో గాదు! సన్నని తలవెం(టుకతో!!– ఏమా(త్రం గాలికి కదిలినా అది తెగి మీద పడేట్టుగా వుంది!

దాన్ని చూడ్డంతోనే ఆలీఖానుగుండె బేజారైంది. దిల్ కుష్ మాటే మరిచిపోయాడు. ముచ్చెమటలూ పోసి, వొళ్ళు గజగజ వణకడం మొదలెట్టింది! ఆ ఖడ్గం తెగి మీదపడితే ఇంక ఏమైనా వుందా? గుక్కెడు(పాణమూ ఇట్టే ఎగిరిపోతుందే!

'బాబోయ్, నాకీ సింహాసనంవద్దు, కిరీటం వద్దు, రాజరికం అంతకంటేవద్దు. నావారిన నన్ను పోనివ్వండి' అంటూ ఎలుగెత్తి సింహాసనం దిగిపోబోయాడు. కాని బేబరు అతనిని కదలనివ్వలేదు. "ఆలీ!—నాకు అల్లా (ప్రసాదించిన ఆ సౌఖ్యమేమిటో రేపు ఉదయంపరకూ నువ్వు అనుభవించక తప్పదు!" అన్నాడు బేబరు.

అలీఖాను వణికిపోతూ "(ప్రభూ, నెత్తి మీద కత్తిపెట్టి 'సుఖపడమం'టే నేను అనుభవించే సుఖమేమిటి నామొహం!" అంటూ గోలపెట్టేడు.



బేబరు చిరునవ్వుతో, "అలీఖాన్!— చ(క్రవర్తి జీవితం ఇంతే! నీ నెత్తిపైనున్న కత్తికిమల్లేనే చ(క్రవర్తులకు (ప్రతిక్షణమూ (ప్రాణాపాయమే" అన్నాడు.

"అలాగైతే, తమరెన్నడూ నాకుమల్లే భయంతో వణకలేదే మరి!" అని ధైర్యంచేసి అడిగాడు అలీఖాను.

"(ప్రాణాపాయానికి భయపడటం ధీరుల లక్షణంకాదు. ధీమంతుడికీ తెలుసు అపాయం ఉందని. ఐతే, అతడు సామాన్య మానవులలాగా (ప్రాణం పోతుందేమోననే భీతితో దిగులుపెట్టుకుని కూర్చోడు" అని చెప్పాడు చ(క్రవర్తి.

"సరే ప్రభూ! నా మానాన నన్ను పోనివ్వండి. ఆ వెంట్రుక ఏక్షణంలో తెగి కత్తి నా మెడమీద పడుతుందో!" అని అనేకవిధాల చక్రవర్తిని బతిమలాడాడు అలీఖాను.

"పడితే పడనీ. ఈ ఇరవైనాలుగు గంటలూ రాజభోగమనేది యేమిటో నువ్వు అనుభవించే తీరాలి" అంటూ చక్రవర్తి భటుల్ని ఖానుగదికి కాపలావుంచి చక్కా పోయాడు.

అలీఖాను నోరెత్తలేదు. ఇరవైనాలుగు గంటలూ ప్రాణాలు పిడికిట్లోపెట్టుకుని కాలంగడిపేడు. ఎవటపెట్టినవాటిలో ఒక్క డిల్‌కుష్‌ఐనా నోటికిపోలేదు. ఆ రస గుల్లాలు, ఆ గులాబ్‌జామ్‌లు, ఎక్కడి వక్కడే ఉండిపోయినై.

"అరే అల్లా!—ఎంతటి శిక్ష విధించి నావురా" అని తనను తనే తిట్టుకుంటూ, క్షణం యుగంగా గడిపాడు అలీఖాను. గడువు దాటటంతోనే 'బ్రతుకు జీవుడా!' అనుకొని బయటపడ్డాడు.

అటుతరువాత, బేబరు ఎదురై పలక రించేసరికి, "పగవాడికైనా వద్దుప్రభూ ఈ కిరీటం!" అంటూ దాన్ని తీసి, చక్రవర్తికి సమర్పించివేశాడు. బేబరు చిరునవ్వుతో, "ఖానూ! తలవెంట్రుక తెగి, కత్తి మీద పడుతుందని భయపడ్డావేగాని నిజానికి అది తెగిపడనేలేదు. నీ పిరికితనమే నిన్ను అంతగా వేధించింది. 'చక్రవర్తికి పట్టిన అదృష్టం పట్టలేదే' అని చాలామంది అసూయపడతారేగాని, ఆ పదవికి ఉండవల సిన ధైర్యం వారిలో లేదన్నసంగతి తెలు సుకోలేరు" అన్నాడు.

అప్పుడు అలీఖాను "తాము సెలవిచ్చి నది అక్షరాలా నిజంప్రభూ. కిరీటంధరించే అర్హత ధీమంతులకే వుంటుంది" అని అంటూ, భక్తిపూర్వకంగా సలాంచేసి వెళ్ళి పోయాడు.






కాశీరాజ్యానికి ప్రభువు శకుంతనుడు. శకుంతనుడు గొప్ప రామభక్తుడు. ఆయన భక్తుడైనందుకు లోకమంతా మెచ్చుకునేది. ఐతే—ఆ భక్తితోపాటు, తనను మించిన రామభక్తుడు ఈ ప్రపంచంలో లేనేలేడనే అహంభావంకూడా ఆతనిలో ప్రవేశించింది.

శకుంతనుడిలో చెలరేగిన ఈ అహంభావాన్ని తరుణంలోనే తగినవిధంగా అణచివేస్తేగాని రాజు పనికిరాకుండాపోతాడే అని ఆలోచించాడు నారదుడు. ఆలోచించి, ఒక చిత్రమైన వ్యూహం పన్నాడు.

ఆ పన్నాగాన్ని అనుసరించి ప్రజ, మూకమూకలుగా వచ్చి 'రాజా!—దుష్ట మృగాలబాధ మిక్కుటంగా వున్నది. భరించలేకుండావున్నాము' అంటూ మొరపెట్టుకున్నారు. వాళ్ళమొర ఆలకించి శకుంతనుడు ఒకరోజున అరణ్యాలలోకి వేటాడబోయాడు. మధ్యాహ్నం వరకూ వేటాడి, వేసట కలగటంచేత సమీపంలో ఒక ఋష్యాశ్రమం చేరుకొన్నాడు.

ఆ ఆశ్రమంలో అప్పుడు ఋషిగణమంతా సమావేశమైవున్నారు. భోగట్టాచేయగా, అది విశ్వామిత్రుని ఆశ్రమం అని తెలిసింది. విశ్వామిత్రుడు శకుంతనుణ్ణి ఎంతగానో మర్యాదచేసి, కుశలప్రశ్నలు వేశాడు. బడలిక తీరినతరువాత శకుంతనుడు వెళ్ళిపోదామని లేచాడు. లేచి మహాఋషులవద్ద సెలవుతీసుకొందామనుకుంటే, ఆయనకు ఒక సంశయం కలిగింది. అక్కడ కూర్చొన్న ఋషిగణంలో అందరూ గొప్పవారే. తరతమ భేదాలు ఏర్పరచటానికే వీలులేదు. మొట్టమొదట వశిష్ఠుడు కూర్చునివుండటంచేత, 'వశిష్ఠాది మహర్షులారా! అనుజ్ఞ యివ్వండి, పోయివస్తా' నన్నాడు రాజు.

ఇది సాకుగా తీసుకొని, ప్రక్కనేవున్న నారదమహర్షి విశ్వామిత్రుణ్ణి ఉసుకొలిపి

ముద్దా సోమప్పశాస్త్రి - పరశువాకం



వెళ్లి, అతి ఆవేశంతో "శ్రీరామా!—నీవల్ల నెరవేరవలసిన ఒక స్వకార్యంమీద వచ్చాను. చేస్తానని వాగ్దానమిస్తే చెబుతాను' అన్నాడు. రాముడు ఆశ్చర్యపడి, 'ఏమిటి గురూజీ! మీధోరణి నన్ను కలవరపరుస్తున్నది. ఎన్నడైనా మీమాట జవదాటి ఎరుగుదునా! ఎందుకీ సంశయం?" అన్నాడు. రాముడు మాట యివ్వగానే, 'రామా!—కాశీరాజు శకుంతనుడివల్ల నాకు తీరని పరాభవం జరిగింది. నీ బాణంతో వాడిని ఛేదిస్తేగాని నాకు నిద్రపట్టదు' అన్నాడు. రాముడు జిజ్ఞాసలో పడ్డాడు. ఏమీ?—జీవితంలో కనివిని ఎరుగని గడ్డు సమస్య దాపరించింది. శకుంతనుడు తనకు ముఖ్యభక్తులలో ఒకడాయెనే, ఎలా? ఏమైనాకానీ, గుర్వాజ్ఞ! 'సరే' నన్నాడు రాముడు. విశ్వామిత్రుడు వెళ్ళిపోయాడు.

ఈలోపల—నారదుడు ఈ సమాచారమంతా శకుంతనుడికి చెప్పి, 'రాజా!—నీ దేవుడైన రాముని బాణంవల్లనే నీవు హతుడవు కాబోతావుసుమా!' అని హడలు పుట్టించాడు. అందుకు శకుంతనుడు 'నారదా! గత్యంతరం చెప్పవా?' అని వేడుకోగా, ఒక ఉపాయం చెప్పిపోయాడు.

'చూశావుటయ్యా గాధినందనా! ఈ శకుంతనుడి గర్వం? నీ ఆశ్రమంలో తలదాచుకొని, నీ ఆతిథ్యం పొంది, తీరా వెళ్లేటప్పుడు 'వశిష్ఠాదిమునులారా, సెలవు!' అంటాడే? ఈ మాటలో అంతరార్థం ఏమన్నా గ్రహించావా?' అన్నాడు.

తారామండలానికి లేచాడు విశ్వామిత్రుడు: 'నిజమే, నువుచెప్పింది. కన్నుమిన్ను కానకుండావున్నాడు వీడు. ఎవరితో ప్రసంగిస్తూవున్నాడో తెలియలేదు కాబోలు! ఉండు, నిమిషంలో పట్టిస్తా వీడిపని...' అంటూ, చర్రుమని బయల్దేరి శ్రీరాముని వద్దకు వెళ్ళాడు.




ఆ వుపాయాన్ని అనుసరించి, శకుంత నుడు వెంటనే అంజనాదేవి ఆశ్రమానికి చేరుకొని, అపాయస్థితిలో ఉన్నవానిలాగా ఆర్తనాదం చేశాడు. ఇది విని, అంజన పరుగెత్తివచ్చి, 'నీకు వచ్చిన భయంలేదు నాయనా! కలిగిన ముప్పు యేమిటో చెప్పు' అని ధైర్యం చెప్పింది. అప్పుడు గుండె నిబ్బరంతెచ్చుకొని, శకుంతనుడు తనకు కలిగిన ఆపద వెల్లడించి, రక్షించమన్నాడు.

అక్కడ శ్రీరాముడు శకుంతనుడి విషయంలో జిజ్ఞాసపడ్డట్టే, యిక్కడ అంజనాదేవి 'అయ్యో! మా రాముడితోనే పేచీ వచ్చిందే! శరణాగతుడైన యితన్ని యెలా రక్షించటం?' అని తీవ్రాలోచనలో పడింది.

ఇంతలో ఆంజనేయుడు యింటికి వచ్చాడు. విచారంతోవున్న తల్లినిచూచాడు. 'అమ్మా! నేనుండగా నీకెందుకీ విచారం? ఎటువంటి అసాధ్య కార్యమైనాసరే, చెప్పు నెరవేర్చి తీరుతాను' అంటూ పాదాక్రాంతుడైనాడు.

బిడ్డడిని లేవదీసింది అంజన. బాష్ప ధారలతో, 'నాయనా—ఆర్తనాదం విని, అమాయికంగా ఈ శకుంతనుడికి అభయమిచ్చాను. తీరా, భోగట్టాచేయగా, మన శ్రీరాముడితోనే వైరం యేర్పడింది! ఏమిటీ అగ్నిపరీక్ష మనకు?' అని వాపోయింది.

అందుకు మారుతి 'అమ్మా!—నీవెంతమాత్రం దుఃఖించకు. రాముని బాణానికి ఎలా తిరుగులేదో నీ మాటకూ అలానే తిరుగులేదు. రాముడుకాదు, అతడిని పుట్టించిన బ్రహ్మకానీ, నీ మాట అక్షరాలా నెరవేరవలిసిందే. గుర్వాజ్ఞ నెరవేర్చటం రాముడి విధిఐతే, నీ అజ్ఞ నెరవేర్చటం నా విధి' అన్నాడు పిడుగులు పడేటట్టు.

ఇంతలో శాంతమూర్తిఐన శ్రీరాముడు విలయతాండవం చేసికొంటూ అంజన ఆశ్రమానికి వచ్చాడు. 'నా గురువును

పరాభవించిన శకుంతనుడు యిక్కడ దాగుకొన్నాడు. విడిచిపెట్టు హనుమా!' అని ఆజ్ఞాపించాడు. 'విడువను. మాతల్లి అతనికి అభయమిచ్చింది. అతనిపైన ఈగనైనా వాలనివ్వను' అన్నాడు ఆంజనేయుడు.

'నేనే ధర్మరక్షకుడనైతే, నా గురువును పరాభవించిన కాశీరాజు తలను ఖండించి వచ్చుగాక!' అంటూ, రాముడు తన బాణాన్ని వదిలిపెట్టాడు.

'నేనే నిజమైన రామభక్తుడనయితే, రాముని బాణంవల్ల కాశీరాజుకు యెట్టి అపాయమూ కలుగకుండుగాక!' అని ఆ రామబాణానికి అంజనేయుడు భక్తితో నమస్కరించాడు. హనుమ ఈ మాటలు అనగానే వాయువేగంతో పోతున్న రామ బాణం టకీమని ఆగిపోయింది!!

తిరుగులేని రామబాణం అలా నిలిచి పోయేసరికి సమస్త భువనాలు కంపించి పోయినై. హహాకారాలు చెలరేగినై! దేవ గణం, ఋషిగణం, అందరూ భూలోకానికి దిగి వచ్చారు. 'ఇది ధర్మయుద్ధంకాని వేరు కాదు. హనుమే రామం, రామే హనుమం!!' అన్నారందరూ. చివరకు నారదుని పన్నాగం వెల్లడైంది. ఏమైనా,'నా బాణానికి తిరుగులే' దన్నాడు శ్రీరాముడు. 'రామా! నీ బాణా నికి తిరుగులేదన్న సంగతి నాకు తెలుసు. నేనే దానిని భరిస్తా'నంటూ,'రామబాణమా!- నాలో ఐక్యమైపో!' అని వేడుకొన్నాడు హనుమ. అప్పుడు రామబాణం వచ్చి హనుమంతుని గుండెకు దూసుకపోయింది. అతని వక్షం చీలిపోగానే అందులో శ్రీ సీతా రాముల దివ్యమంగళ విగ్రహాలు ప్రత్యక్ష మయినై! అందరూ ఆశ్చర్యపోయారు. శకుంతనుడు తల వంచుకున్నాడు. సాటి లేని రామభక్తి గల హనుమను వినుతిస్తూ దేవతలు పూలవర్షం కురిపించారు. తల్లి అంజనాదేవి చేయి తగలగానే హనుమ గుండె ఎప్పటిలాగా అతుక్కుపోయింది.






పూర్వం ఊహానగరాన్ని రాజధానిగా చేసుకుని వక్రబుద్ధి అనేరాజు పరిపాలించేవాడు. ఆ రాజు సైన్యంలోకల్లా ప్రతాపుడనేవాడు గొప్పవీరుడు. ప్రతాపుడు ఒకనాడు వేటకని సమీపంలోని అడవికి వెళ్లి, అక్కడ ఒక కొలనుపక్క పొదలో దాగి కూర్చున్నాడు. వన్యమృగాలేమైనా దాహంతీర్చుకోటానికి వస్తే, కొట్టవచ్చుకదా అని అతని వూహ.

ఎంతసేపు కనిపెట్టుకున్నా అనాడు అడవిజంతులేవీ రాలేదుగాని సాయంత్రం పడేసరికి ఆకాశంమీదినుంచి ఏడుహంసలు వచ్చి వాలినై. ఆ హంసల్నిచూచి మెచ్చుకుంటూవుండగా, అవి ఱెక్కలు తీసి గట్టుమీద పెట్టినై. అలా పెట్టిన వెంటనే ఆ ఏడు హంసలూ అపురూప సుందరమైన ఏడుగురు దేవకన్యలుగా మారిపోయినై. కిలకిల నవ్వుతో వారు కొలనులోకి చొరబడి జలక్రీడ లారంభించారు.

చప్పుడుచెయ్యకుండా ప్రతాపుడు బయటకు వచ్చి, ఱెక్కలన్నింటిలోనూ మిక్కిలి అందమైన ఒకజతను చేతపుచ్చుకుని, మళ్లీ దాగుకొన్నాడు. దేవకన్యలు తనివితీరా జలకాలాడి, గట్టుపైకి వచ్చి, ఎవళ్ళఱెక్కలు వాళ్ళుధరించి మళ్లీ హంసలుగామారి, రివ్వుమని ఎగిరిపోయారు. ఐతే, అలా ఎగిరిపోగలిగింది ఆరుగురుమాత్రమే. ఏడో అమ్మాయి తన ఱెక్కలజతకోసమని కొలనుపద్దనే ఆగిపోవలసివచ్చింది.

ఆ దేవకన్యను చూడగా ప్రతాపుడికి మక్కువపుట్టింది. ఆమె ఱెక్కలు పోయినందుకు దిగులుపడి, 'నాఱెక్కలు తీసుకున్నవారెవరో దయవుంచి వాటిని ఇచ్చెయ్యండి. పిల్లలగన్న తలిదండ్రులైతే, వారు నన్నూ ఒక కూతురుగా ఎంచుకోవచ్చు. కన్యఐతే నేను చెల్లెలినైవుంటాను. పెండ్లిగాని పురుషుడే ఐనట్టయితే పెండ్లిచేసు

కె. ఎస్. రాజగోపాల్ - కడప



కుంటా. దయవుంచి నా రెక్కలు నాకు ఇచ్చెయ్యండి' అనిజాలిగా ప్రార్థించింది.

ఈ మాటలు చెవిని పడీపడటంతోనే పొదలో దాగొనివున్న ప్రతాపుడు రెక్కలతో బయటకువచ్చి, 'ఇవిగో నీరెక్కలు. వీటిని ధరించి హంసవై స్వేచ్ఛగా మీలోకానికి ఎగిరిపో. మీవాళ్ళనుండి నిన్నువేరుచేసి, బాధపెట్టినందుకు మన్నించు' అన్నాడు. దేవకన్య రెక్కలు పుచ్చుకోలేదు.

"మీరెవరో ఉత్తములలాగా వున్నారు. మానవులలోకూడా ఇంత మంచివాళ్ళు ఉన్నారా? ఇంత అందమైనవాళ్లున్నారా?" అంది ఆశ్చర్యంగా. అందుకు ప్రతాపుడు, 'అంతగా మెచ్చుకుంటున్నావు గనక పోనీ, నన్ను పెళ్ళిచేసుకోకూడదా?' అన్నాడు ఏమంటుందో చూదామని. ఆ సుందరి ముసిముసి నవ్వుతో, తనమెడలోని నవరత్న మాలను నిజంగానే ప్రతాపుడి మెడలో వేసింది. తలవనితలంపుగా పట్టిన ఈ అదృష్టానికి అతడు మురిసిపోయాడు.

ప్రతాపుడు భార్యతో తన నగరానికి తిరిగి వెళ్ళటంతోనే ఆమె చక్కదనాన్నిగురించిన వార్తవెళ్ళి రాజుగారి చెవిలోపడింది. వక్రబుద్ధి మారువేషంలో వెళ్ళి ఆ దేవకన్యను చూచివచ్చాడు.

ప్రతాపుడికి కబురుచేసి, లేనిప్రేమ నటిస్తో, 'ప్రతాపా! ఏడు సముద్రాలకవతల ఒక అడవి వుంది. ఆ అడవిలో ఒక కొండ వుంది. ఆ కొండ కొసని ఒక కోటవుంది. ఆకోటకి రాజు తొమ్మిది అంగుళాల శరీరం, తొంభైగజాల పిలకా వున్న చిత్రాంగుడనే యక్షుడు. ఆ రాజువద్ద అదృశ్యసేవకి అనే భూతం ఒకటివుంది. నువ్వువెళ్లి ఎలాగైనా దాన్ని వశంచేసుకురావాలి. వస్తే, నిన్ను సేనాధిపతిగా చేస్తాను' అన్నాడు.

ప్రతాపుడు ఇంటికివచ్చి మానవమాత్రులకు అసాధ్యమైన ఈ మహత్తరకార్యాన్ని




గురించి భార్యతో చెప్పగా, ఆమె 'నీకు వచ్చిన భయం లేదు. ఈ వెండిబంతి తీసుకువెళ్ళి నగరం అవతల, నేలమీద పెట్టు. అది నీముందు దొర్లుతూపోయి నీకు దేవలోకంలోవున్న మా అమ్మగారియింటికి దారిచూపుతుంది. పెళ్ళివేళ నీమెడలో, నేనువేసిన ఆ నవరత్నమాల ఆనమాలు చూపి, నా క్షేమవార్త చెప్పి, నువ్వువచ్చిన పని మావాళ్లతోచెప్పు' అని అంటూ, వెండి బంతిని అతని చేతిలోపెట్టింది. ప్రతాపుడు అదేప్రకారం చేసి, అత్తవారింటికి చేరు కున్నాడు.

ఈలోగా, ఊహానగరంలో వక్రబుద్ధి ప్రతాపుడి భార్యను రప్పించి, 'ఇంక నీభర్త తిరిగివచ్చేదేమిటి? ఇంతకీ వాడు నా నౌఖరు, నేను రాజునిగదా! నన్ను పెళ్ళిచేసుకుని రాణివికావటం నాకోరిక' అన్నాడు. ఆమాటకు ఆమె ఉగ్రురాలై, 'నేను ఎవర్ననుకున్నావు! జాగ్రత్త!' అంది. వక్రబుద్ధి భయపడి తగ్గిపోయాడు. కాని, కనిపూని సముద్రంఒడ్డున ఒంటిస్తంభం మేడలో ఆమెను ఖైదుచేయించాడు.

అక్కడ దేవలోకంలో,—ప్రతాపుడి మెడలోని నవరత్నమాల చూడటంతోనే, ఆనమాలుగట్టి, దేవకన్య బంధువులు ఆద రించి, వచ్చినపని అడిగేరు. అతడు చెప్పేడు. అప్పుడు అతని అత్తగారు పక్షుల్నీ, మృగాల్నీ, చేపల్నీ అన్నింటినీ రప్పించి, 'ఫలానా యక్షుని రాజ్యం ఎక్కడవుందో మీకుతెలుసా?' అని అడిగింది.

అందులో ఒక్క కుంటికప్పమాత్రం, "నాకుతెలుసు. ఐతే చాలాదూరంవెళ్లాలి" అంది. ఆ కప్పని తోడిచ్చి అమె వాళ్ళిద్దర్నీ ప్రయాణంకట్టి పంపింది.

ప్రతాపుడు దానివెనకాలే వెళ్లేడు. సప్త సముద్రాలూ దాటి అడవీ, అడవిలో కొండా, కొండకొసని చిత్రాంగుడి కోటా చేరు




కున్నారు. అప్పుడు కప్ప ప్రతాపుడితో, 'తమ్ముడూ, ఇదే కోట. నేను ఇవతలవుండి నీకోసం యెదురుచూస్తొంటాను. పోయిరా. నీకు జయమవుతుంది!' అని ఆశీర్వదించి లోపలకి పంపింది. ప్రతాపుడు కోటప్రవేశం చాడుగాని అది కోటలాగే లేదు; అది ఒక చీకటికోణం. కన్నుపొడుచుకున్నా కన పడని ఆ అంధకారంలో అతడు తడుము కుంటూవెళ్లి. ఒక మూల ఆయాసం తీర్చు కుంటూ కూర్చున్నాడు.

మరి కాస్సేపటికి ఝళ్ళుమని తలుపు చప్పుడైంది. 'అదృశ్యసేవకీ, అదృశ్యసేవకీ' అని మేఘానికిమల్లే ఉరుముతో ఎవరో పిలువసాగారు. అంతవరకూ చీకటిగా వున్న కోటంతా దీపాల వెలుగులతో పట్టపగ లైపోయింది. ప్రతాపుడు చటుక్కున ఒక స్తంభంచాటుకి పోయి దాగుకొని ఆ వచ్చింది ఎవరా అని చూశాడు.

చూస్తే ఏముంది? తొమ్మిదంగుళాల శరీరం, తొంభైగజాల పిలకా వున్న యక్షుడు కనపడ్డాడు. "ఈతడేనా అంత చప్పుడుచేస్త!" అని ఆశ్చర్యపోతూ ప్రతా పుడు నిలబడేసరికి యక్షుడు, 'అదృశ్య సేవకీ, యేమిటి ఈ ఆలస్యం? లోకాలన్నీ తిరిగి తిరిగి ఆయాసంతో వచ్చానుకదా, కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు ఇవ్వాలని తెలీదూ?' అని అరిచాడు. బంగారు కలశం ఒకటి వస్తూన్నట్లు ప్రతాపుడికి కనపడింది గాని దాన్ని తెస్తూన్న అదృశ్యసేవకి కనపడ లేదు. పాదాలచప్పుడు మాత్రం వినపడింది, అంతే. చిత్రాంగుడు కాళ్ళూ చేతులూ కడుక్కొని, 'త్వరగా అన్నం వడ్డించవేం, అదృశ్యసేవకీ!—నేనిప్పుడు కుబేరుడివద్దకు వెళ్ళాలి' అన్నాడు. వెంటనే వెండిపీట ఒకటి వాలింది. దానిముందు భమిడిఆకు ఉంచబడింది. పంచభక్ష్యపరమాన్నాలూ వడ్డించబడ్డాయి. ఈపని అంతా క్షణంలో

చేసిన అదృశ్యసేవకి మాత్రం ప్రతాపుడికి కనపడలేదు. చిత్రాంగుడు భోజనం పూర్తి చేసి, ఒక త్రేన్పు త్రేంచి, పిలక సవరించు కుంటూ కుబేరలోకానికి వెళ్ళిపోయాడు. దీపాలన్నీ ఒక్కమాటుగా ఆరిపోయినై.

ప్రతాపుడు యెంతో మర్యాదగా, మధుర స్వరంతో 'ఓ అదృశ్యసేవకి! దయచేసి దీపాలు వెలిగించు' అన్నాడు. దీపాలు వెలిగాయి. 'ఆకలివేస్తోంది. అన్నం పెడ తావా?' అన్నాడు. పీట వాలింది. ఆకు సిద్ధమై వడ్డన పూర్తిఅయింది. 'రా, అదృశ్య సేవకీ, నీయజమానుడికి వడ్డించావేగాని నువ్వు తిన్నట్టులేదు. నువ్వుకూడా వడ్డిం చుకో. ఇద్దరం కూచుని తిందాం' అన్నాడు ప్రతాపుడు. అప్పుడు ప్రతాపుడికి ఒక కంఠ స్వరం వినపడింది. "ఎవరబ్బాయి నువ్వు? చాలా మంచివాడివిలాగున్నావు. ఈ చిత్రాం గుడికి ఎన్నివందల సంవత్సరాలనుంచో సేవచేస్తున్నాను కాని ఒక్కనాడుకూడా వాడు నీకుమల్లే సన్మాదరించిన పాపాన పోలేదు" అంది ఆ కంఠస్వరం.

అదృశ్యసేవకికూడా భోజనంచేస్తూంది. అప్పుడు ప్రతాపుడు 'అలైతే అదృశ్యసేవకీ, నువునాతో వచ్చెయ్యి' అన్నాడు. ఆ కంఠ



స్వరం, "తప్పకుండా వస్తా. ఐతే ఉన్నచిక్కు ఏమిటంటే: ఎంత సామర్థ్యమున్నా నా అంతట నేను ఏపనీ చెయ్యలేను. 'అదృశ్య సేవకీ, నువ్వు నాతోరా' అని ఆజ్ఞాపించు. ఈక్షణంలోనే బయల్దేరుతాను" అంది. ఇంకే ముంది? అదృశ్యసేవకే తనకు కిటుకు చెప్పేసింది! తన ఒక్క ఆదరణవాక్యం ఆ భూతాన్ని ఎంతలో వశంచేసుకుంది! 'అదృశ్యసేవకీ, నాతో రా' అన్నాడు ప్రతా పుడు. అతనివెనకాలే అడుగులచప్పుడు వినపడింది.

కోట అవతల కాచుకున్న కుంటికప్ప కంటపడటంతోనే ప్రతాపుడు, 'అదృశ్య

సేవకీ, ఈ కప్ప నా ప్రాణమిత్రము. దీని కుంటి పోగొట్టు' అన్నాడు. కప్ప కాలు చక్కబడి, ఆనందంతో అది తైతక్కలాడింది. 'అదృశ్యసేవకీ, మమ్మల్ని అత్తవారింటికి చేర్చు' అన్నాడు. మరుక్షణంలో వాళ్ళు అక్కడకు చేరుకున్నారు. అత్తగారు జరిగిన సంగతంతా విని ప్రతాపుడితో, 'నాయనా, నీ మంచితనమే నీకు సమస్తాన్నీ వశం చేస్తోంది. నీమంచితనమే నాకూతుర్ని ఆకర్షించి, నీకు భార్యగా చేసింది. నీవుచూపిన దయా ఆదరణా, ఇవే ఈ భూతాన్ని నీకు వశంచేశాయి. త్వరగా వెళ్ళు. మాపిల్ల ఆపదలో వుంది, కాపాడుకో' అని చెప్పింది.

తరువాత ప్రతాపుడు, 'అదృశ్యసేవకీ, నన్ను ఊహానగరానికి చేర్చు' అన్నాడు. అక్కడ చేరుకోవడంతోనే ప్రతాపుడు తన భార్యను చెరలో వుంచిన వక్రబుద్ధితో, 'దుర్మార్గుడా, నువ్వు నాపట్ల తలపెట్టిన ద్రోహానికి క్షమాపణకోరుకో. లేకుంటే...' అనేటంతలో రాజు, 'చూస్తారేమర్రా, వీణ్ణి చీరెయ్యండి!' అని ఆజ్ఞాపించాడు.

'అదృశ్యసేవకీ, ఈ వీరులందరికీ తగినట్టుగా శాస్తిచేసి బుద్ధిచెప్పు' అన్నాడు ప్రతాపుడు. అదృశ్యసేవకి ఆ వీరులందరి జుట్టూ కలిపి ముడిపెట్టి, ఆ ముడి దొరకబుచ్చుకుని దూరంగా ఒకచోట కూలవేసి వచ్చింది. వక్రబుద్ధి కత్తిదూసి ప్రతాపుడి మీదికి దుమికేడు. "అదృశ్యసేవకీ, వీడిపని పట్టు!' అన్నాడు ప్రతాపుడు. అందరూ చూస్తోండగా వక్రబుద్ధి తలక్రిందు అయాడు. రెండుతాళ్ళ ప్రమాణాన్ని పైకి వెళ్ళిపోయాడు. అక్కడనుంచి వాణ్ణి అదృశ్యసేవకి వదిలేసింది. వక్రబుద్ధి తల వందముక్కలయింది.

తరువాత ప్రతాపుడు ఊహానగరానికి రాజు అయాడు. దేవకన్య రాణీ అయింది. సుఖంగా వున్నారు. అదృశ్యసేవకి వుండనే వుందిగా, ఇంక వేరే సేనాధిపతి ఎందుకు?






చాలా కాలం క్రిందట గాజులరేగ గ్రామంలో మస్తాన్ అనే ఒక దూదేకుల సాహెబు ఉండేవాడు. అది కుగ్రామం కావటంవల్ల మస్తానుకు క్రమంగా అపూళ్ళో భుక్తిగడవటం కష్టమవుతూవచ్చింది.

'ఏమిట్రా అల్లా!—కథ అడ్డుతిరిగిందే' అని ఆలోచించేటంతలో లోగీస అనే గ్రామంపోయి, అక్కడ కాలక్షేపంచేదామని మనసుకి తట్టింది. మస్తానుకు వున్న ఆస్తి అంతా దూదేకులబద్ధ వక్కటే. ఒకరోజున అతడు తన దూదేకులబద్ధ భుజానవేసుకుని లోగీస వెళదామని సిద్ధపడ్డాడు.

గాజులరేగుకీ లోగీసకీ పదికోసులు దూరానికిపైగా వుంటుంది. మధ్యని పెద్ద అడవికూడా వున్నది. ఈ పదికోసుల దూరమూ, అడవిదాటుకొని, మస్తాను కాలినడకనే పోవాలి. తోవలో తినటానికి ఏమైనా పట్టుకుపోవాలికద!

ఎలానో ఒక్క అణాడబ్బులు పోగుచేసి, మానెడు కొమ్ముశనగలు కొనుక్కొని, అవి మూటకట్టి బయల్దేరాడు. రెండు ఝాములయ్యేసరికల్లా మూటలో శనగలు అతడి కడుపులోకి వెళ్లిపోయినై. దగ్గరలో ఒక పిల్లకాలువ కనిపిస్తే పోయి, కడుపులో మిగిలిన చోటును నీళ్లతో నింపేశాడు. కాస్తంత ఆకలి అణగగానే భుజానవున్న దూదేకులబద్ద 'టిం—టిం' మనిపిస్తూ, హుషారుగా అడుగులు వేయసాగాడు.

చరచరా నడుస్తున్న మస్తాను, ఎందుకో గాని ఒకచోట ఠపీమని నిలబడిపోయాడు! ఎందుకేమిటి?—ఒక్క పదిగజాల దూరంలో ఒక పెద్దపులి గాండ్రుపెట్టుకొంటూవచ్చి అక్కడ ఆగింది!! మస్తానుకి ముచ్చెమటలు పోసినై. అయినా, అతడి చేతులు ఆగకుండా దూదేకులబద్దను అలా 'టిం–టిం' మనిపిస్తూనే వున్నాయి.

యస్. రాధాబాయి, మోహన్రావు - విజయనగరం



మస్తాన్‌ను చూసి పులి నిలబడి పోయింది. అది గోండ్రుపెట్టడం మానలేదు. సాయిబు చేతులు 'టిం – టిం'మనిపించటం మానలేదు.

ఇంతలో, ఇదంతా కనిపెడుతూవున్న ఒక నక్క పులిదగ్గరకు వెళ్లి, 'ఏం పులి మామా !- ఒక్క గెంతుగెంతి ఆ మనిషిని మింగివేయటం మానేసి, అలా చూస్తూ నిలబడిపోయావేం!' అని ప్రశ్నించింది. అందుకు పులి 'చూశావా, వాడి చేతులో ఎంతపెద్ద టుపాకీ వున్నదో! నన్ను చూసి వాడు పారిపోవటానికి బదులు వాణ్ణిచూసి నేనే హడిలిపోవలసి వచ్చిందిప్పుడు' అంటూ తన మనస్సులోని భయం వెల్లడించింది.

నక్కకి తెలుసు, సాయిబుచేతిలో వుండేది ఎంతమాత్రం టుపాకీ కాదని. అందుకని, తెలివితక్కువగా పులి భయపడడం చూచి నక్క లోలోపల నవ్వుకుంది. 'సరే, మామా! నేనుండగా నీకేం భయం? నేనువెళ్ళి వాడిని మాటల్లో పెడతాను. ఆ సందుచూసుకుని నువ్వు మెల్లిగా పారిపో' అన్నది.

అది అన్నదేకాని, పులికిమట్టుకు ధైర్యం చాలలేదు; 'మరి, వాడు ఏమరుపాటుగా వున్నట్టు నాకెలా తెలుస్తుంది?' అని అడిగింది. అందుకు నక్క 'ఒస్, ఇదొక పెద్ద ప్రశ్నా! నేను గట్టిగా ఒక కేకపెడతాను. కేకవిని పారిపో' అని సలహాచెప్పింది.

ఇలా సలహాచెబుతూ వెనకనించి మస్తాన్ వద్దకు పోయి'ఏమయ్యా సాయిబూ! ఇదే ఒక్కడవూ అడవిలో నిలబడిపోయావే, ఎందుకోసం?' అని పలకరించింది.

అందుకు మస్తాను చికాకుతో "ఏమా? ఎందుకు నిలబడ్డానో తెలియటంలేదూ? ఎదట పెద్దపులి నిలబడివుండగా 'ఎందుకు నిలబడ్డా?'వని ఆదొక ప్రశ్నా" అన్నాడు.

అప్పుడు నక్క 'ఏమిటయ్యా, ఇంతేనా నీ పౌరుషం! ఒక్క కేకవేశానంటే చూడు, పులీ గిలీ పారిపోవాలన్న మాట,' అని ధైర్యంగా మాటాడింది. ఇదంతా డచ్చా లనుకున్నాడు సాయిబు మొదట. ఐనా, ఈమాట ఎంతవరకు నిజమో చూదామని: 'నక్కా, నక్కా!— నిజంగా నీ కేకలోనే అంతటిశక్తి వున్నట్టయితే, నీవు కోరుకొన్న బహుమతి యివ్వనా?' అన్నాడు మస్తాను. ఈమాట అనగానే నక్క ఒక పెద్దకేక పెట్టింది. దెబ్బతో పులి మాయమైంది! నిశ్చేష్టుడై, మస్తాన్ 'బ్రతుకుజీవుడా' అనుకొన్నాడు.



గండంతప్పి సాయిబు కాస్తంత స్తిమిత పడటంచూచింది నక్క. 'నా బహుమతి మాట ఏమి?' టన్నది. కోరుకోమన్నాడు మస్తాను. తడుముకోకుండా 'నాకేమీవద్దు. నీ గుండెకాయ ఇస్తేచాలు'నన్నది నక్క. శని వదిలి పీడ పట్టుకున్నట్టయింది పాపం సాయిబుకి యిప్పుడు.

'ఒస్, ఇంతేనా నీ కోరిక! ఇంకా ఎంత పెద్దవస్తువు కోరుకుంటావో, ఇయ్యగలనో లేనో అని జంకుతున్నాను. నాకు ప్రాణ దానం చేసిన నీ ఋణం ఎన్ని జన్మలకైనా తీర్చుకోగలనా?—ఐతే, ఒక్క నిమిషం ఓరిమిపట్టాలి నువ్వు. ఎవ రేదికావాలన్నా ఈ నోటితో లేదు అని అనలేను. నీలాగానే ఒక తోడేలువచ్చి నా కడుపులో రొట్టె ముక్క కావాలన్నది. తీసుకోమన్నాను. అది రొట్టెముక్క తీసికోవటం కనిపెట్టి, దానిని పట్టటానికని రెండు వేటకుక్కలు నా కడుపులో దూకినై. వాటిని విరగడైపోనీ, తరువాత నువుదూరి నాగుండెకాయ తీసికొందువుగాని' అని ఎంతో తాపీగా సమాధానం చెప్పాడు.

వేటకుక్కలమాట చెవినిబడేసరికల్లా పరుగుచ్చుకుంది నక్క! సాయిబు తన దారిని తను వెళ్ళిపోయాడు.




కార్వేటినగరంలో శరభారాయుడనే ధన వంతుడొకడు ఉండేవాడు. అతడు ధన వంతుడన్న మాటేగాని, ఎవడికీ ఒక్క దమ్మిడీఐనా దానంచేసేవాడు కాడు. చెయ్యకపోతే పోయెగాని, వచ్చి అడిగిన వాడినల్లా ఏదోవిధంగా ఏడిపించి మరీ పంపుతూ ఉండేవాడు. అతడిసంగతి తెలిసిన బిచ్చగాళ్ళూ, యాచకులూ ఆ గుమ్మమే ఎక్కేవాళ్ళుకాదు. తెలియక వచ్చినవాళ్ళు మాత్రం భంగపడి పోతూండేవాళ్ళు.

ఇలావుంటూండగా, ఆ నగరానికి వెంక టేశు అనే యాత్రికుడొకడు వచ్చాడు. వెంకటేశు రోడ్డుమీద నిలబడి, ఆ పూటకు ఎక్కడ భోజనం అమరుతుందా అని ఆలో చించటం ప్రారంభించాడు. దారినపోతూన్న ఒకణ్ణి ఆపి, 'బాబూ, నేను పరదేశిని. ఈపూట నాకు దేవతార్చనకు వీలయే ఇల్లు చూపగలరా ?' అని అడిగేడు.

ఆ మార్గస్థుడు వెంకటేశుతో, 'పెట్టే ఇల్లుయేదో చెప్పలేనుగాని పెట్టని యిల్లు మాత్రం ఒకటివుంది. ఆ గడపమాత్రం ఎక్కకు!' అంటూ దూరాన కనబడుతూన్న శరభారాయుడి ఇల్లు చూపించాడు.

అందుకు వెంకటేశు, 'ఏంబాబూ, ఆ గృహస్థు పిల్లికి బిచ్చంపెట్టని పిసినారా ?' అని అడిగాడు

'బిచ్చంపెట్టడు సరికదా ఆ పిల్లిని పట్టుకుని తలగొరిగి మరీ పంపుతాడు!' అన్నాడు మార్గస్థుడు.

వెంకటేశు ఉత్తి పెంకిడిప్పకాయి. మార్గస్థుడు చెప్పినమాట వినటంతోనే ఆ శరభారాయుడి సంగతేమిటో తెలుసుకోవా లనిపించి, తిన్నగా వెళ్ళి ఆ గుమ్మమే ఎక్కాడు. తలుపుతట్టేసరికి శరభారాయుడే వచ్చి తలుపుతీశాడు. 'ఏంకావాలయ్యా నీకు ?' అని అడిగేడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మద్రాసు

అందుకు వెంకటేశు, "ఏదోనా? ఒక్క పూట భోజనం. నేను యాత్రికుణ్ణి. ఈపూట మీయింట భోజనంచేసి, సాయంకాలానికల్లా పైగ్రామం చేరుకుంటా. 'ఈ వూరిలో అన్నదాత యెవరూ ?'అని వాకబుచేసేసరికి తమయిల్లు చూపేరు !" అన్నాడు. శరభారాయుడు విషపు నవ్వొకటి నవ్వి, "అలాగా? సరిగ్గా నేను భోజనానికి లేద్దామనుకుంటూంటేనే వచ్చావయ్యా నువ్వు! 'అభ్యాగత స్వయంవిష్ణుః' అనికదా అన్నారు పెద్దలు. విష్ణు స్వరూపుడికి విందుచెయ్యాలిగాని మామూలు పదార్థాలతో తృప్తిపడి ఊరుకో రాదుకదా. కనుక, పంచభక్ష్యపరమాన్నాలూ తయారుచేయిస్తాను! ఒక్కనిముషం ఆగు!' అన్నాడు.



శరభారాయుడి మాటల్లో వున్న వెటకారం వెంకటేశు కనిపెట్టేడు కాని, ఏమీ ఎరుగనివానికిమల్లే నటిస్తూ, 'బాబూ, ఒక్క నిముషంకాదు, ఎంతసేపైనా ఆగుతాను. ఇంతకి యేమాత్రం పొద్దెక్కిందిగనక !' అనేసి, అక్కడనే సావిట్లో నడుంవాల్చాడు. తనయింట్లో, వాడంత చనువుగా ఆ కుర్చీలో వాలడంతో శరభారాయుడికి కోపమే వచ్చింది. కాని, వాడికి తగినశాస్తి ఎలాగా చేసిపంపాలి గనక ముందే తొందరపడడం ఎందుకని తమాయించాడు. వెంకటేశు కళ్ళుమూసుకుని 'ఏం జరగబోతుందా ?' అని ఆలోచిస్తున్నాడు.

మరి కొంచెంసేపటికి శరభారాయుడు, 'లేవోయ్ విష్ణుస్వరూపా ! విందు అరగిద్దువుగాని ! ఎవర్రా అక్కడ ? మాకు రెండు చెంబులతో నీళ్లు తీసుకురండి' అన్నాడు. వెంకటేశు కుర్చీలోనించి లేచి, నీళ్లకోసం ఎదురుచూశాడు. ఎవడూ నీళ్లుతేకుండానే శరభారాయుడు ఎవరిచేతిలోంచో ఒక చెంబును అందుకున్నట్లూ నీళ్ళతో కాళ్ళూ చేతులూ కడుక్కుంటున్నట్లూ నటించాడు.



వెంకటేశు, 'నాటకం ప్రారంభమైంద'ని గ్రహించి తనుగూడా శరభారాయుడికి మల్లేనే నీళ్లచెంబు అందుకుని కాళ్ళూ చేతులూ కడుక్కున్నట్లు అభినయించి భోజనానికి సిద్ధమయాడు. తనతోబాటు వాడూ సిద్ధమౌతాడనుకోలేదు శరభారాయుడు. 'ఏవీ నీళ్లు?' అని నీళ్ళునములుతో నిలబడతా డనుకున్నాడు.

'వీడెవడో కొంచెం అసాధ్యుడులాగే వున్నాడు. సరే కానియ్, చూద్దాం' అనుకుంటూ, 'రావయ్యా, భోజనాలసావిట్లోకి' అని అక్కడికి వెంకటేశుని తీసుకువెళ్లేడు. అక్కడ రెండుపీటలూ, ఆ పీటలముందు వెండికంచాలూ, ఆ కంచాలచుట్టూ చిన్న చిన్న వెండిపళ్ళేలూ, గిన్నెలూ అమర్చబడి ఉన్నాయి. అయితే కంచాలలోగాని, పళ్ళేలలోగాని, గిన్నెలలోగాని పదార్థాలేమీ లేకుండా అన్నీ ఖాళీగానే వున్నాయి.

శరభారాయుడు తనొకపీటమీద చతికిలపడి, అతిథిని రెండవపీటమీదికి దయచెయ్యమన్నాడు. ఆ సావిట్లో వంటవాడుగాని, వడ్డనవాళ్ళుగాని ఎవరూ కనపడలేదు. శరభారాయుడు ఎవరో నెయ్యివడ్డిస్తుంటే తాను పురిషెడుపట్టినట్టుగా నటించి, 'చాలు, చాలు అయనకి వెయ్యి!' అన్నాడు. వెంకటేశు ఆయనకంటే ఎక్కువగా నటించి, నిజంగా చెయి నిండిపోయి నెయ్యి కారిపోతూన్నట్లుగానే, 'అరెరె, వేసెయ్యకయ్యా బాబూ! ఆగు, ఆగు! అంటూ కంచంలో లేని అన్నం కలపటం ప్రారంభించాడు.

శరభారాయుడు 'వీడెవడో ఘట్టివాడే!' అని కొంచెం లోపల మెచ్చుకుంటూ, పైకి, 'అన్నం, పప్పూ రోజూ వుండేవే, అవి కలపకు. భక్షణాలు మొదలెట్టు. ఆగిన్నెలో రసగుల్లాలు చూడు; నవనవలాడుతో పాకంలో ఎలాగ తేలుతున్నాయో! పట్టుకు



లండర్రా ఇంకా వడ్డించండి !'అని హుషారు చేశాడు.

'మొహమాటపడకయ్యా, వేయించుకో!' అన్నాడు వెంకటేశును. అందుకు వెంకటేశు !! 'అయ్యా, మీ వంటమనిషి ఎవరో కాని, ఆ నలుణ్ణీ భీముణ్ణీ చంపిపుట్టినట్టుగా వున్నాడండి. ఓహెూ! అమృతహస్తం' అని ఊట లూర్చుకుంటూ కంటికి కనపడనీ, చేతికి తగలనీ ఆ రసగుల్లాలు రుచిచూడ సాగాడు. 'అరెరె! అలా వేసేస్తున్నావేమిటి! నాది కడుపనుకున్నావా, ఖండవిల్లి మడుగనుకొన్నావా? అయినా ఎన్నని తినగలను? తీపి మొహంమొత్తిపోయింది!' అన్నాడు, వెంకటేశు ఆ లేని వడ్డనవాడితో.

శరభారాయుడు అందుకుని, 'తీపి మొహంమొత్తితే కాస్త పులిహెూర నంచుకో వోయ్! జీడిపలుకులూ అవీ వేసి మాంచి పసందుగా తయారుచేశాడు!... గుప్పెడు పలుకులుతీసి వడ్డించరా ఆయనకి! బజ్జీలు కూడా పట్టుకురా! ఆవడలు వడ్డించు!... కాస్త పెరుగు వడ్డించమన్నావుటోయ్ విష్ణు స్వరూపా!' అన్నాడు.

వెంకటేశు ఒక ఖాళీగిన్నె చూపి, 'బాబూ, ఈ గిన్నెలోని పదార్థమేమిటో తెలిసిందికాదు' అన్నాడు. అందులో నిజంగా ఏదోవున్నట్లే!

అందుకు శరాభారాయుడు, "అదా? అది 'అవియల్' అంటారు. మలయాళ వంటకం బలే రుచిగా వుంటుందిలే. మరి కొంచెం వడ్డించుకో!" అన్నాడు.

శరభారాయుడు ఈ నాటకాన్ని ఇలానే చివరని ముగించి, ఉత్తుత్త తాంబూలంకూడా ఒకటి సమర్పించి, ఉత్తి కడుపుతో సాగ నంపదలుచుకున్నాడని వెంకటేశుకి తెల్లమై పోయింది. అయితే, యిప్పుడు ఈ దుర్మార్గుడికి బుద్ధిచెప్పటం ఎలాగా అని ఆలోచించాడు.

'అయ్యా, నాకు ద్రాక్షరసం ఇష్టమని మీకెలా తెలిసిందీ?' అంటూ, అక్కడున్న ఖాళీగిన్నె ఒకటి తీసుకుని తాగుతోన్నవాడికి మల్లే గుటకలువెయ్యటం ప్రారంభించాడు. 'బలే,బలే,ఏమి మాధుర్యం! అమృతం!... ఏమన్నాను? అమృతమా? ఛస్, అమృతానికీ దీనికీ పోలికా? ఈరసంముందు అమృతం, గిమృతం దిగదుడుప్! డుప్! డిప్! డప్!' అంటూ లేచి, త్రాగి కైపెక్కిన వాడికిమల్లే వెంకటేశు తూలడం మొదలెట్టేడు. శరభారాయుడు నిర్ఘాంతపోయి, 'ఏమిటిది?' అంటూ లేవబోయేసరికి, వెంకటేశు వొళ్ళుతెలియనివాడికిమల్లే తడబడుతూ, 'ఏమిటి కోమటి! టీ! కాఫీ! కోకో! ఓవల్‌టిన్!' అంటూ శరభరాయుడి జుట్టుపట్టుకు వంచి, నడ్డిమీద దబదబా నాలుగు పిడిగుద్దులు వేశాడు.

శరభరాయుడు 'మొర్రో, మొర్రో' అనే సరికినలుగురూ పోగయారు. శరభరాయుడు ఏడుస్తో, 'ఈ దుర్మార్గుడు నాయింటికి భోజనానికనివచ్చి నన్నుకొట్టేడు చూడండి!' అన్నాడు. వచ్చినవాళ్లు వెంకటేశు కేసి చూసి, 'ఇదేంపని? తిన్నఇంటికి ఘాత తలపెడతావా?' అన్నారు.

వెంకటేశు పశ్చాత్తాపం నటిస్తో, 'క్షమించండి! ఈయన యిచ్చిన ద్రాక్షరసం మూలాన్ని కైపెక్కి వొళ్ళుతెలియక ఏదో అపచారంచేశానుగాబోలు!' అన్నాడు. శరభరాయుడు, 'ఉత్తిది, ఉత్తిది! ద్రాక్షరసం లేదు, ఏమీలేదు!' అన్నాడు. 'ద్రాక్షరసం అబద్ధమైతే విందూ అబద్ధమే!' అన్నాడు వెంకటేశు.

వచ్చినవాళ్లందరకూ అయోమయంగా కనపడి, శరభరాయుడి వంటవాణ్ణి అడిగే సరికి, వాడు రహస్యం వెల్లడిచేసివేశాడు.

'అయితే ఆ అబద్ధపు విందుకి ఈ నడ్డి బాజా సరిగానే వుంది' అనుకొంటూ ఎవరి దారిని వాళ్ళు చక్కాపోయారు.






గోపీ బడిదొంగ. అతని చెల్లెలు సుశీలకు చదువుకోవటమంటే అసక్తి. గోపీ ఎంత సేపూ బడి యెగగొట్టేందుకు యత్నించే వాడు. ఒక్కపూట బడి మానడమంటే సుశీలకు మనసు కష్టంతోచేది.

వాళ్ళ యింటి నడవలో గోడకు ఒకపెద్ద గడియారం వున్నది. అది పావుగంటలు కూడా కొడుతుంది. ఒకరోజున గోపీ చెల్లెలిని అ నడవలోకి తీసుకుపోయి 'చెల్లాయ్! అ గడియారంవంక చూడు!' అన్నాడు. సుశీల చూచి, 'తొమ్మిదిగంటల నలభై నిమిషాలయింది. లే. బట్టలువేసుకో. బడికి పోదాం' అని వేగిరపెట్టింది.

అందుకు గోపీ 'ఇదివక దయ్యమే చెల్లీ!—కొంపమునిగినట్టు మనల్ని బడికి పొమ్మని తొందరపెడుతుంది. మనల్నే కాదు, బడిపిల్లలనూ, ఉద్యోగస్థులనూ, అందరనూ ఇది అలానే హడావుడి పెడుతుంది. దీన్ని ఏంజేసినా పాపంలేదు!' అన్నాడు పిడికిలి బిగబడుతూ.

"అదేమిటన్నయ్యా, అలా కోపగిస్తావే! నిన్ను ఆడుకోనివ్వలేవని గడియారాన్ని నిందిస్తావుగానీ, దీని ముఖంచూస్తే ఎంత మంచిది! గడియారం ముఖం చూసుకు వెళితే, బడికి వేళకుపోగలం; వేళకు వెళితే మేష్టారు కొట్టరు" అన్నది.

సుశీల ఇలా అంటూవుండగానే తొమ్మిదిం ముప్పావు అయింది. గంటలు కొట్టింది. గంటలు కొట్టగానే వాళ్లమ్మ కేకవేసింది 'బడికి వేళయింది, లేవరేమర్రా!' అంటూ.

గోపీ ఉగ్రుడై, పళ్ళుబిగబట్టి, "చూడు, పెద్ద గొంతుకపెట్టుకుని అధ్వాని! దయ్యం!! బ్రహ్మరాక్షసి!!!" అంటూ ఉరుముసాగాడు. ఏమయితేనేం, తప్పదు. గబగబ దుస్తులు వేసుకుని బడికి బయల్దేరాడు. వానివెంబడే గంతులేస్తూ సుశీల వెళ్ళింది.

డి. కస్తూరి - సికంద్రాబాద్

బడికి వెళుతున్నాడన్న మాటేకాని, గోపీ దృష్టి అంతా తనకు అపకారం చేసిన ఆ గడియారంమీదనే వున్నది. 'చెల్లీ!— మన గోడనుండే గడియారాన్ని మంచిదను కొని పొగడుతున్నావు. చిన్నదానివి, నీకు తెలియకుండావుంది. అది పకదయ్యం. పాడుదయ్యం! దాని నోరు ఒక్కనిమిషం ఊరుకోదుకద! అస్తమానం అలా వాగు తూనే వుంటుందే!—అది బడిపిల్లలను కంగారుపెడుతుంది. ఉద్యోగస్థుల్ని మెతు కులు నోట్లో వేసుకోనివ్వదు. రైలుకు వెళ్ళే వాళ్లను పరుగులెత్తిస్తుంది. పాపాత్మురాలు!' అని చెప్పి, మళ్ళీ పళ్ళు బిగించాడు.

సరే, యెలాగో బడికి చేరుకొన్నాడు గోపీ. సాయంకాలమైంది. ఆటలకోసం పరు గెత్తాడు. ఆరుగంటలకల్లా ఆటలు మొద లెట్టారు. ప్రపంచంమరచి పిల్లలందరూ క్రీడాసక్తులై వున్నారు. వాళ్లు మంచి రద్దీలో వుండగా, గడియారపు గంటలు వినిపించినై, గంటలతోపాటు "గోపీ! తిండికి రా నాయనా!!" అనే పిలుపుకూడా వినిపించింది.

ఒక గొప్పకార్యం భగ్నమైనట్టు బాధ పడ్డాడు గోపీ. వాడికి నెత్తురు ఉడుకెత్తి పోయింది. ఆవేశం వచ్చేసింది. చేతికి దొరికిన ఒక రాయి తీసుకొని పళ్ళు పటపట కొరుకుతూ గబగబ నడవలోకి వెళ్ళాడు. సత్తువకొద్దీ గడియారానికి గురిచూసి కొట్టాడు. గలగలమంటూ అద్దంపెంకులు కిందరాలినై. అదే గోపీచెవులకు వినబడిన ఆఖరుచప్పుడు! అప్పటినుంచీ బుద్ధివచ్చిన బడిపిల్లవాడిలాగా మరి ధ్వనిచేయక, ఊరికేవుంది ఆ గడియారం.

ఒక వీరుని గర్వంతో గోపీ, "చెల్లీ! మనమీద పగబట్టిన శత్రువును సంహారం చేసివేశా. ఇకదీనిభయం మనకు లేదు. మనం హాయిగాపోయి ఆడుకో వచ్చు" అంటూ సంతోషించాడు. సుశీలమట్టుకు బితుక్కుమంటూ, లోపలికి పారిపోయింది.



1



2



# నేటి పాపలు  రేపటి పౌరులు





3

4

1. చి॥ రమణి, పుదుకోట
2. చి॥ శ్రీపాద రాజరాజేశ్వరి, రాజమండ్రి
3. చి॥ కృష్ణమూర్తి, బెంగుళూరు
4. చి॥ కోటిరత్నప్రసాద్, తెనాలి

# అట్టమీంది బొమ్మ

మాలినినదీతీరాన అందమైన అడవులుండేవి. ఆ అడవులు సమస్తమైన ఫలవృక్ష జాతులతోను, బారులుతీర్చిన పర్వతశ్రేణులతోను, నదీనదములతోను నిండారి, చూడ ముచ్చటగా ఉండేవి. ఈ అడవులలో చిత్రమేమిటంటే : భయంకరమైన వన్య మృగాలూ, మురిపెము గొలిపే సాధుజంతువులూ ఎట్టివైరమూ లేక కలిసి ఎంతో మచ్చికగా సంచరించుతూ వుండెవి.



ఇలాటి మహారణ్యంలో నెలకొనివున్నది కణ్వమహర్షి ఆశ్రమం. కణ్వుని ఆశ్రమంలో ఒక ఆరేళ్ల బాలుడు ఆటలాడుకొంటూ ఉండేవాడు. ఐతే, కణ్వమహర్షి చలవ వలన శుక్లపక్ష చంద్రునివలె పెరుగుతూ వున్న ఆ బాలుడు సామాన్యుడు కాడు. అతడు ఆడే ఆటలూ సామాన్యమైనవి కావు. అవి చాలా అపురూపమైనక్రీడలు.

ఆరేళ్లవాడే కానీ, ఆ బాలుడు దీర్ఘబాహుడు, అనంతజవ సత్వసంపన్నుడు. చక్రవర్తి చిహ్నములతో ప్రకాశించేవాడు. ఆ పసివాడు మహారణ్యంలోని పులులను, సింహాలను, ఏనుగులనూ పట్టితెచ్చేవాడు. వాటిని ఆశ్రమంలో వుండే మహావృక్షాలకు కట్టిపెట్టేవాడు. అంతేకాదు. వాటిపైన నిర్భయంగా స్వారిచేసి, ఎన్నెన్నో ఆటలాడుకునేవాడు. ఆ బాలుని శైశవక్రీడలు ఆశ్రమంలోని మునులనే భీతికొలిపేవి. భయమనేది ఎరుగక వన్యమృగాలను అణగద్రొక్కిన ఆ పసివానికి తగినట్టుగా ఆశ్రమవాసులు అంతాకలిసి 'సర్వదమనుడు' అని పేరుపెట్టారు.

సర్వదమనుడు వయస్సుకుమించిన బలానికి, తేజస్సుకు, విక్రమానికి పెట్టిందిపేరు. సర్వదమనుని తల్లి కణ్వమహర్షిచే పెంపబడిన శకుంతల. అతని తండ్రి శకుంతలను గాంధర్వవిధిగా వివాహం చేసుకొన్న దుష్యంతుడు. ఒకప్పుడు అశరీరవాణి వినబడి, సర్వదమనుడికి 'భరతుడ'నే పేరు తగివుంటుందని చెప్పింది. అప్రకారమే తలిదండ్రులు పసివాడైన సర్వదమనుణ్ణి భరతుడని పిలువసాగారు.

దుష్యంతుని తరువాత భరతుడే గద్దెయెక్కాడు. పరాక్రమంతో పరరాజులను గెలిచి, ధర్మపాలనం సాగించి అతడు యశముపొందాడు. అనేక యాగాలూ, అశ్వమేధాలూ చేసి తరించాడు. ఈ భరతుడు ఏలినదేశమే మనకు జన్మభూమి ఐనటువంటి భారతదేశం.

అపురూపంగా చెప్పుకొంటూవున్న ఆ బుల్‌బుల్‌పిట్టను పట్టితెచ్చి, తనయెదుట గానంచేయించమని చక్రవర్తి పరివారానికి ఆజ్ఞాపించినట్టు చదివివున్నాముకద.

ఈ ఆజ్ఞ వినగానే, చక్రవర్తిగారికి అంత రంగికుడు, పరివారానికి పెద్ద ఐన దాదా గబగబ మెట్లుదిగి వచ్చాడు. మళ్లీ మేడ ఎక్కాడు. మళ్ళీ దిగాడు. దివ్యభవన మంతటా గాలించి, మూలమూలలా తెగ వెతికాడు. ఎంత వెతికినా, అపురూపమైన ఆ బుల్‌బుల్‌పిట్ట సంగతి తెలిసిందేకాదు.

చివరికి ఎలాఐతేనేం, హవేలీలో వంటచేసే చిన్న దానికి ఆ పిట్టసంగతి తెలుసునన్న వార్త దాదాకు తెలియవచ్చింది. తెలియగానే అతనికిపట్టిన కంగారు కాస్తంత తగ్గింది.



వెంటనే దాదా వంటగదికివెళ్ళి, 'చిన్నదానా!—మన చక్రవర్తిగారి ఆరామంలో మధురగానంచేసే బుల్‌బుల్‌పిట్ట అనే ఒక పక్షినిగురించి నీకు తెలుసునటకాదా! అది ఎక్కడవుంటుందో తీసుకవెళ్ళి చూపితివంటే ఇవాళ భోజనాలవేళప్పుడు నీకు మన ఫాదుషావారి దర్శనంచేయిస్తా'నన్నాడు అప్యాయంగా. ఫాదుషావారిని కళ్లవేడుకగా దర్శించే భాగ్యం కలుగుతుందనగానే ఆ చిన్నది పొంగిపోయింది. ఆమెవెంబడి దాదా

# అట్టుచివరి బొమ్మ

కొంత పరివారాన్ని వెంటబెట్టుకుని ఆరామంలోకి వెళ్ళాడు.

వెళుతూ వెళుతూ ఒకచోటికి వచ్చేసరికల్లా అందరూ గతుక్కున ఆగిపోయారు. ఏమీ!—అక్కడే చెట్టుమీద బుల్‌బుల్‌పిట్ట అమరగానం చేస్తున్నది!!

అప్పుడు చిన్నది ఆ పిట్ట దగ్గరకంటావెళ్ళి, 'ఓయీ బుల్‌బుల్!—ఘనతవహించిన మన చక్రవర్తిగారు నీ మధురగానం వినాలని కుతూహలపడుతున్నారు. ఈవేళ రాత్రికే నీవువచ్చి ప్రభువువారికోరిక తీర్చాలి సుమా' అని అన్నది.

అందుకు బుల్‌బుల్ పిట్ట మానవభాషలో మాటాడుతూ, 'చిన్నదానా'—అంతకంటె నాకు కావలిసిందేమున్నది! తప్పక వస్తాను. ఐతే—సంగీతానికల్లా భవనంలోకంటె ఆరామంలో పాడటమే బాగావుంటుంది. ఐనా మన ప్రభువువారిని సంతోషపరచటానికి నేను శాయశక్తులా యత్నిస్తాను' అని అంటూ, చెట్టు దిగివచ్చి చిన్నదాని బుజంమీద వాలింది. చిన్నది ఆ పిట్టను తీసుకువెళ్ళి ఫాదుషావారికి సమర్పించింది.

## ఇంద్రజాలం

### చిత్రమైన పేకట్రిక్కు

ఇంద్రజాలికుడు 53 ముక్కలున్న చీట్లపేక తీసుకు రావాలి. యాభైమూడోముక్క జోకరన్నమాట. పేకంతా కలిపేసి ఒకముక్కను కోరుకోమనాలి. కోరుకున్న ముక్కను ఇంద్రజాలికుడు చూడకుండా పేకపైనపెట్టాలి. తర్వాత పేక కలపకుండా రెండుమూడుసార్లు కోయాలి. అప్పుడు ఇంద్రజాలికుడు 'అన్నట్లు మరిచిపోయాను. ఈ తమాషాచెయ్యటానికి జోకరు అక్కర్లేదు. దాన్ని తీసివేస్తాను' అనిచెప్పి ఆ జోకరు ఎక్కడుందో వెతికి దాన్ని లాగివేయాలి. ఆ తరువాత పేక ముక్కలన్నీ సరీగ్గా ఒకచేత్తోపట్టుకుని ఒక్కొక్కటే లెక్కపెడుతున్నట్టు Y-O-U—H-A-V-E—S-E-L-E-C-T-E-D—T-H-I-S అంటూ ఒక్కొక్క అక్షరానికి ఒకముక్కచొప్పున టేబిల్‌మీద పెట్టాలి. చివరకు S అనివచ్చిన ముక్కను ఇదా అన్నట్టు ప్రేక్షకులకేసి చూస్తే - వాళ్ల ముఖవైఖరినిబట్టి అది కాదని తేలిపోతుంది. అప్పుడు మళ్ళీ ముక్కలన్నీ వరసతప్ప కుండా తీసి, అమిగిలిన పేకముక్కలపైన పెట్టేసి, మళ్ళీ ఒక్కొక్కటే లెక్కపెడుతున్నట్లు S-O-R-C-A-R-P-L-E-A-S-E-S-A-Y-N-O-W అని అక్షరానికి ఒకటి వచ్చినచొప్పున బల్లమీదపెడితే - చివరకు W అనే అక్షరానికి ముక్క ఏదయితే ఉంటుందో - అదే ప్రేక్షకుడు కోరుకున్న ముక్క అయివుంటుంది.

ఇందులోవున్న కిటుకు ఇప్పుడు చెపుతున్నాను : అసలు మొదట్లో పేకతెచ్చుకునేటప్పుడే ఆ జోకరును అట్టడుగు ముక్కకు పైనపెట్టి వుంచుకోవాలి. అంటే జోకరుక్రింద ఒకముక్క, పైన 51 ముక్కలూ ఉంటాయన్నమాట. ఆ

# జాలము

పేకను ముందు కలిపేటప్పుడు అడుగు రెండుముక్కలూ కలిసిపోకుండామాత్రం చూసుకోవాలి. మిగతాముక్కలన్నీ ఎలా కలిసిపోయినా ఫర్వాలేదు. ప్రేక్షకుడు కోరుకునే ముక్క ఈ అడుగు రెండుముక్కలూ కాకుండా ఏవి కోరుకున్నా ఫర్వాలేదు. అతర్వాత పేకను కోయటమేకాని కలపటంమాత్రం చెయ్యకూడదు. తర్వాత ఈ అటకు జోకరు అక్కర్లేదని మనవిచేసి ఆ జోకరు వెతికి అందులోంచి తీసెయ్యాలి. జోకరు ఎక్కడనుంచి తీశారో సరీగ్గా అక్కడికి పేకను రెండుభాగాలుగా చెయ్యాలి. అడుగు భాగం ముక్కలుపైన పెట్టాలి. అంటే ఏమన్నమాట? ప్రేక్షకుడు కోరుకున్నముక్క దానంతటదే పేకపైకి వచ్చేసిందన్నమాట. దానిక్రింద యాభైముక్కలుపైన ఒక ముక్కమాత్రం ఉంటాయి. ఇంద్రజాలికుడు అది ఏముక్క అని తెలుసుకోవాల్సినదికూడాలేదు. మొదట You have Selected This అంటూ ముక్కలు లెక్కపెట్టినప్పుడు అముక్క కిందకువస్తుంది. రెండోసారి పొరపాటు అయిందంటూ అముక్కను పైనపెట్టి మళ్ళీ Sorcar, Please Say Now అని ఒక్కొక్కటే బల్లమీదపెట్టి చూపేటప్పుడు చివరి W అక్షరానికివచ్చిన ముక్కే ప్రేక్షకుడుకోరుకున్నదై తీరుతుంది.

---

ఈ గారడినిగురించి పాఠకులు ఇంకావివరంగా తెలుసుకోదలిస్తే, 'చందమామ' పేరు ఉదహరిస్తూ సరాసరి ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషుభాషలోనే వ్రాయాలి. ఇదిముఖ్యం.

అడ్రెసు: ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్
12/3/A, జమీర్‌లేన్, బాలిగంజ్, కలకత్తా - 19

## ఒంటిగీత బొమ్మ




పంపినవారు: వి. పూర్ణానంద శర్మ - వెల్లటూరు

గతనెల చందమామ 12 - వ పేజిలోని 'తప్పుపట్టండి' బొమ్మకు సమాధానాలు:

1. త్రాసుచిప్పలకు యింకా ఒక్కొక త్రాడు చొప్పున ఎక్కువగా వుండాలి.
2. పుష్పానికి మధ్యలో కేసరములు వుండాలి.
3. పడకకుర్చీకి వెనక ఆసరా వుండాలి.
4. తేనెటీగకు మరిఒక జత రెక్కలుండాలి.
5. గొడుగుకు లోపల కమ్ములుండాలి.
6. కత్తెరకు తాపళంచేసి వుండాలి.
7. కాఫీకప్పుకి ఒక్కటేచెవి వుండాలి.
8. చేతికి ఇంకొక వేలు వుండాలి.
9. ఆవుకి చెవి ఉండాలి.

## ఫొటో వ్యాఖ్యల పోటీ

### సెప్టెంబరు ఫొటోల ఫలితాలు



సెప్టెంబరునెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగావున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు:

మొదటి ఫొటోకు: 'బాలలగోడు'

రెండవ ఫొటోకు: 'చిలుకల జోడు'

పంపినవారు:

**వేములకొండ వెంకటరావు, కాకినాడ.**

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా సెప్టెంబరు చందమామ ఫొటోల దిగువన ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- సెప్టెంబరు సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



## అక్టోబరు నెలలో

ప్రచురించబడే ఫొటోల నమూనాలు, వివరాలతోసహా ప్రక్కపేజీలో చూడండి.

ఒక ముఖ్యసూచన:

మీరు పంపదలచుకున్న వ్యాఖ్యలు కార్డుపైననే వ్రాసిపంపాలి. కొందరు కాగితంపైన వ్రాసి కవరులో పంపుతున్నారు. ఇలాంటివి పరిశీలింపబడవు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

అక్టోబర్ 1952 :: బహుమానం రూ. 10/





అక్టోబరు సంచికలో వచ్చే ఫోటోలు రెండూ పైన చూడండి.
వీటికి సరియైన వ్యాఖ్యలు కావాలి. వివరాలు యివి:—

1. వ్యాఖ్య ఫోటోకు సరిపడేటట్లు వుండాలి.
2. ముచ్చటైన ఒక్కమాటలోగానీ, రెండు మూడు మాటలుగల ఒక చిన్ని వాక్యంలో గానీ వ్యాఖ్య ఉండవచ్చు.
3. అన్నిటికన్న ముఖ్యవిషయం: మొదటి ఫోటోకూ, రెండవ ఫోటోకూ కూర్చేవ్యాఖ్యలు రెండూ ఒకదానికొకటి సంబంధించివుండాలి.
4. ఒక్కొక్కరు ఒక్కొక్క సెట్టు వ్యాఖ్యలకంటే ఎక్కువ పంపకూడదు.
5. ఒక కార్డుపైన మీ వ్యాఖ్య, పూర్తిపేరూ, విలాసమూ వ్రాసి, మాకు పంపాలి.
6. అగష్టు 15-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ఆ తర్వాత చేరినవ్యాఖ్యలు పరిశీలించబడవు.
7. మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా అత్యుత్తమంగావున్న సెట్టుకు (అనగా రెండువ్యాఖ్యలకు కలిపి) రూ. 10/- బహుమతి ఇవ్వబడుతుంది.

వ్యాఖ్యలు పంపవలసిన అడ్రసు:

ఫోటో వ్యాఖ్యల పోటీ:

చందమామ పబ్లికేషన్స్

వడపలని పోస్టు :: మదరాసు - 26.

